# తేనె తెట్టె

నోరి నరసింహశాస్త్రి

• సాహితీ సమితి • తెనాలి

# తేనె తెట్టె

## పరిచయము

'మేతర్‌లింక్' ఒక్క నాటికరచయిత మాత్రమే కాడు. అతనికి ఇతర సరదాలతో పాటు తేనెటీగలను పెంచడముకూడా ఉండేది. 'తేనెటీగజీవితము' అనే గ్రంథము అతడు వ్రాసినాడు. ఆయన నాటకాలలోవలెనే అందులో కూడా సామాన్యవిషయాలే చెప్పుతూ, విశిష్టమైన ఊహలు ధ్వనించేట్లు చేసినాడు. ఆపుస్తకము ఇంగ్లీషు తర్జుమా నేను షుమారు పదిహేనేళ్ళక్రిందట చదివినాను. అందులో తేనెటీగల సంయోగము నామనస్సులో దృఢముగా నాటుకున్నది. భారతీయసంస్కారముతో పెరిగిన నాకు ఆవిషయాలే అలౌకికమైన ఊహలు రేపినవి. అందుకు ఫలితము ఈ నాటికా రచన. ఈ నాటికకు మూలమైన విషయవర్ణనముతప్ప ఆ గ్రంథములోనుంచి ఏమీ గ్రహించ లేదు. తేనెటీగలనుగూర్చి వ్రాసిన ఇతర పుస్తకాలలో కూడా ఆవిషయాలే ఉంటవేమో!

ఈనాటిక వ్రాసినతర్వాత ఆగ్రంథము తెప్పించి సందర్భ మున్న భాగాలు చదివినాను. నేను చేర్చిన విష యాలు కొన్ని అందులో లేనట్లూ, కొన్ని విరుద్ధంగా ఉన్నట్లూకూడ కనపడింది. ఐనప్పటికీ నాటిక మార్పుచేయ డానికి సాధ్యపడక, అట్లాగే ఉంచినాను. ఇది నాటిక కాని విషయవర్ణన చేసే శాస్త్రగ్రంథము కాదు. కాబట్టి విజ్ఞులు మన్నించ గలరు.

తేనెటీగెలు మూడు రకములు. స్త్రీజాతిది తెట్టెకు ఒక్కటే ఉంటుంది. దానికి ఇంగ్లీషుపేరునుబట్టి 'రాణి' అనీ, కొంతస్వాతంత్ర్యముతో 'తల్లి' అనికూడా వ్యవహ రించినాను. సృష్టిభారమంతా దానిదే! ఇక పురుషజాతివి చాలా వుంటవి. అవి పని చేయవు. తేనె కూడబెట్టలేవు. 'రాణి'కి గర్భధారణకు కారణముకానడ మొక్కటే వాటి ఉపయోగము. అన్నింటిలో ఒక్కటే అందుకు ఉపయోగ పడుతుంది. అదికూడా ఒక్కసారే. వాటిని ఇందులో 'పోతులు' అని పుంలింగముగా వ్యవహరించినాను. మిగి

లిన తేనెటీగలే తేనెతెట్టెలో పని అంతా చేసేవి. వాటికి పుంభావము కాని, స్త్రీభావము కాని లేదు. కాని తేనెతెట్టె అధికార మంతా నిజముగా వాటిదే. వాటికి అవసర మని తోచినప్పుడే 'రాణి'ని బయటికి రానిస్తవి. వాటికి ఇష్ట ముంటేనే ముందు వచ్చిన రాణి ఇతరరాణులను చంప గలుగుతుంది. 'రాణి'కి గర్భోత్పత్తి ఐ మేఘమండలములో నుంచి నిరపాయముగా తిరిగి వచ్చినతర్వాత, అవి చావక మిగిలిఉన్న పోతుటీగలమీద ఒక్కసారి పడి వాటిని సర్వ నాశనము చేస్తవి. తేనెతెట్టెస్థైర్యమూ, వృద్ధీ వాటిప్రధాన లక్ష్యము. అందుకు అవసర మైన విధముగా అన్నిటినీ ఉప యోగించుకుంటవి. వీటిని ఇందులో సామాన్యముగా 'తేనె టీగలు' అని నపుంసకముగా వ్యవహరించినాను.

రాణి బయటికి రాగానే ఆది రాణులుకాదగిన గుడ్ల నూ, రాణులౌతున్న వాటినీ పొడిచి చంపివేస్తుంది. కొందు రాణులు ఒకేపర్యాయము బయటికి వస్తే అందులో ఒకటి చనిపోయేదాకా అవి ద్వంద్వయుద్ధము చేస్తవి. తేనెటీగలు

తమకు మరొక రాణితో అవసరము ఉంటుం దనుకుంటే తెట్టెలో ఉన్న 'రాణిగుడ్లను' చంపకుండా రాణికి అడ్డము పోతవి. కాని ఈ రెండూ ఈనాటికలో వర్ణితములు కాలేదు.

'రాణి' ఇతరరాణులను చంపిన కొంతకాలానికి ఆకాశములోకి ఎగిరి పోతుంది. వెంటనే ఆ తెట్టెలోనివే కాకుండా, చుట్టుపక్కల అన్ని తెట్టెలలోనివీకూడా పోతుటీగలు దానిని కామోద్రేకముతో వెంబడిస్తవి. రాణిని అందుకోవలెనని ఉద్వేగముతో శక్తి ఉన్నంతవరకూ ఎగిరి అందుకోలేక అందులో ఎన్నో ప్రాణాలు విడుస్తవి. రాణి మేఘమండలముదాకా ఎగిరిపోతుంది. అంతవరకూ ఎగరగలిగిన పోతుటీగతో దానికి సంయోగ మవుతుంది. ఆసంయోగముతో పోతుటీగ చనిపోతుంది. అంతట రాణి పోతుటీగ కళేబరముతోసహా కిందికి దిగివస్తుంది. ఆపైన సృష్టి ప్రారంభిస్తుంది. ఈనాటికకు మూల మీకథే! కొన్ని రోజులు జరిగే ఈకథ నాటికలో కొన్నిగంటలలోకి కుంచించినాను.

'రాణి' సామాన్యముగా మూడు నాలుగు సంవత్స రాలు జీవిస్తుంది. అంతకాలమూ అది తెట్టె విడిచిపోదు. గుడ్లను పెట్టడమే దాని పని. అందుకు దానికి మరల పుంయోగము అవసరము లేదు.

రాజ్యము చేస్తున్న 'రాణి' చనిపోయినసమయములో అరాజకముగా ఉన్న తేనెతెట్టెతో నాటిక ప్రారంభ మవుతుంది. ఇందుకు మూలములో ఆధారము లేదు. 'రాణి' రాజ్యము చేస్తుం దనుకోవడముకూడా భ్రమే !

'తీక్ష్ణకామాస్తు గంధర్వాః' అని శ్రీమద్రామాయణములో ఉన్న సంపాతివాక్యము స్మృతిలో ఉన్నందువల్ల ఈనాటికలో తెరలో గంధర్వులచేత పాటలు పాడించాను.

ఈనాటిక ఫాల్గున బహుళ అమావాస్యరాత్రి పన్నెండు గంటలకు ప్రారంభము. చైత్ర శుద్ధ పాడ్యమి నాటి సూర్యోదయముతో పూర్తి.

## ప్రదేశము : ఉద్యానవనం.

తేనెటీగల 'ఝుం ఝుం' నాదం నిరంతరంగా తెరలోనుంచి మొదటి నుంచి చివరదాకా వినబడుతూ ఉంటుంది. ఆ 'ఝుం ఝుం' నాదమే నాటికలో పాటలకూ, వచనాలకూ ఆధార శ్రుతిగా ఉంటుంది.

తెరలో గంధర్వులు

ఓహో మానవులారా — ఝుం ఝుం ఝుం ఝుం
మోహావేశం బేమో — ఝుం ఝుం ఝుం ఝుం
మీ కేమైనా ఎరుకా? — ఝుం ఝుం

కంతుని పిలుపున కుబ్బి వ
సంతం బర్పణ చేసే
తెం పది ఎందరి కుంది? — ఝుం ఝుం

ప్రియ తొలి కవుగిటి చొక్కన
మయి మరి మరి కను దెరువని
కామోన్మాదము కలదా? — ఝుం ఝుం

విష కుసుమంబులనే మధు
చషకంబులుగా మార్చే
చుంబన భేదము తెలుసా? — ఝుం ఝుం

జుం జుమ్మను మదుకర
మంజుల నాద మ్మర్థము
విన వలచినచో వినండి. జుం జుం

తెర• ఎత్తగనే పెద్ద తేనెపట్టెమీద గుడ్లు పెట్టవలసిన గదిముందు తేనెటీగలరాణి చనిపోయి పడిఉంటుంది దానిమీదనూ, చుట్టూ తేనెటీగలు మూగి ఉంటవి.

౧ వ తేనెటీగ : గది తయారయిందమ్మా!
౨ తే. ఈ : రాణీ గుడ్లుపెట్టే గది ఇది!
౩ తే. ఈ : అయ్యో, తల్లికి అలుపు వచ్చిందే, నిద్ర పోతున్నట్లున్నది!
౪ తే. ఈ : నిద్రే? — నిద్రే? — రాత్రింబవళ్లూ నిర్నిద్రంగా ఉండే నీకు నిద్ర ఏమిటమ్మా!
౫ తే. ఈ : అయ్యో; ఇంకేముందర్రా, పిల్లలకు మీకేం తెల్సును! వెనకటి రాణి కూడా ఇట్లాగే అకస్మాత్తుగా ఐపోయింది. మనకూ తల్లికీ ఋణం తీరింది.
౩ తే. ఈ : ముసలమ్మా, మమ్ములనుకూడా నీతోపాటు గాభరా పెట్టకమ్మా! తల్లీ!

నెమ్మదిగా రాణిదేహాన్ని కదిలిస్తుంది. రాణి కదలదు.

౫ తే. ఈ: మాతల్లికి ఎప్పుడైనా ముఖాన ఇంత కళ పోయి ఉందా! మైనమువలె మెత్తగా ఉండే తల్లిబొళ్లు బిగుసుకొనిపోయింది.

౪ తే. ఈ: మన తల్లి నిజంగా చనిపోయింది.

అన్నీ గొల్లు మని యేడుస్తవి

౧ తే. ఈ: ఇహ ఈలోకంలో మనవాళ్ళను సృష్టించే దెవరు?

౨ తే. ఈ: సృష్టికర్త్రికే చావు వస్తే ఈ లోకం ఇక క్షీణించి క్షీణించి కొద్దికాలములోనే నశిస్తుంది. మన జాతి లేని ఈలోక ముండిఏమి, లేకేమి!

౧ తే. ఈ: నే నెవరికిక నిత్యము ఉపచారము చేస్తాను!

౩ తే. ఈ: తల్లి లేని ఈలోకము ఎందుకు?

౬ తే. ఈ: మనలో పోట్లాటలు వస్తే తీర్చి రక్షించే దెవరు ఇక!

౪ తే. ఈ: పోతులు దుండగాలు చేస్తే వారిని ఇక

శిక్షించే దెవరు!

౭ తే. ఈ: [అవతలనుంచి వచ్చి] అయ్యో, పోతులు వచ్చి ఎట్లా తేనె తాగివేస్తున్నారో చూడు తల్లీ!— వాళ్ళను నీవద్దకు రమ్మంటే కదలకుండా తేనె కాస్తా తాగివేస్తున్నారు. త్వరగా వచ్చి తేనె కాపాడు తల్లీ!

౧—౬ తేనెటీగల ముఖాలు చూచి ఆగుతుంది.

౮ తే. ఈ: ఈ రాజ్యమంతా ఇక పోతులదే!

అన్నీ ఏడుస్తూ ఉంటవి.

౯ తే. ఈ: [ఏడుస్తూ పరుగెత్తుకుంటూ వచ్చి ౭వ తేనెటీగతో] ఇంత ఆలస్యం చేసినావేమే? పోతులు తేనె అంతా తాగివేసి పెర ఖాళీ చేసినారు. మన మంతా ఇక ఉపవాసం చేయవలసిందే. తల్లికి నాలుక తడుపుకునేందుకైనా తేనెబొట్టు లేదు. —?

౧—౭ తేనెటీగల ముఖాలు చూచి ఆగుతుంది.

౨ తే. ఈ: మన తల్లికి తేనె ఎందుకే ఇంకా?

అన్నీ కలిసి ఏడుస్తూ ఉంటవి

౯ తే. ఈ: [ ఏడుస్తూ కుంటుకుంటూ వచ్చి ౭, ౮ తేనెటీగలతో] బాగానే ఉందే. ఇక్కడ ఏడుస్తూ కూచుంటే ఎట్లా? పోతులు మామీద పడి పీక తెన్నుతున్నారు. నా కాలు విరిగింది. తల్లితో చెప్పి వాళ్ళను వెళ్ళగొట్టించకపోతే మనము బ్రతికే దెట్లా ఇక!

అన్నీ కలిసి ఏడుస్తుంటే కారణం కనిపెట్టి ౯వ తేనెటీగ కూడా యేడుస్తుంది. గుంపులుగా చాలా తేనెటీగలు పరుగెత్తుకు వస్తవి. పోతులు వాటిని తరుముతూ మదించిన ముఖాలతో వెంబడిస్తూ వుంటారు.

తేనెటీగల గుంపు: ఊం, ఉండండి, తల్లితో చెప్పి మీ పని పట్టిస్తాము!

పోతులు పకపక నవ్వుతారు.

తే. గుం: ఇదుగో, తల్లి మీమదము అడుస్తుంది, చూడండి!

౧వ పోతు: తల్లి ముసలిదైనది లేండి!

పోతులు పక్కున నవ్వుతారు.

తేనెటీగలు గుంపుగా, రోషంతో ౧౦౯ తేనెటీగల వద్దకు వచ్చి కలుసుకుంటవి. కాని కారణం తెలుసుకొని వాటితో పాటు యేడుస్తుంటవి.

౨ పోతు: ఇక్కడ తల్లి ఉన్నట్టుంది, ఆగండిరా కాస్త!

పోతులు కాస్త నిలుస్తాయి.

3 పోతు: [పరకాయించి చూచి] ఈ బంట్లు ఏడుస్తున్న వేషంరా, మొగుడు పోయిన ముండలల్లే!

౪ పోతు: [నవ్వుతూ] మనకీ బానిసతనంలోనుంచి మోక్షమె ఎప్పుడా అనిరా! ఈ నపుంసకపు ఈగలకు మొగుడేమిటిరా మరి?

౫ పోతు: పొరపాటు! బానిసలకు స్వాతంత్ర్యం సరిపడదురా! ఇవన్నీ ఏడుపుకవిత్వం చెపుతున్నవి.

౪ పోతు: ఏడిచావు. ఇన్నింటికి ఒక్కసారి కవిత్వము వస్తుందిరా?

౫ పోతు: తల గలవాళ్ళు పోతే ఏడుపుపద్యాలు కురుస్తవిరా!

౬ పోతు: [సంతోషంతో] అరే చూశారురా, మనను చంపుకు తినే ఈ ముసలిరాణిపని ఐనట్టుందిరోయి.

౧ పోతు: అనుమానము లేదు. ఈజన్మ కీముసలిది కదల లేదు.

౭ పోతు: [రాణిని తాకి] మమ్మల్ని బెదరించవేం?

౨ పోతు: మనకు స్వారాజ్యం వచ్చిందిరా.

౫ పోతు: పాప మీా బానిసలకు ప్రభువు లేకపోతే బతకడ మెట్లాగో!

౯ పోతు: పరాయిప్రభువు వదిలిపెట్టిన ఏకస్థలవాసులల్లే ఈ బంట్లు కొట్టుకుచస్తవి.

౭ పోతు: కొట్టుకుచచ్చే పటుత్వమైనా సడిసిందా పిట్టికి?

౫ పోతు: ఐనా ఈ బానిసలలో బానిసలకు పోట్లాటలు లేకుండా వీటిని రక్షించడానికి వీటిమీద మనము ప్రభుత్వము చలాయిద్దాామురా. ఈ అనాథలమీద మన మంతమాత్రము దాక్షిణ్యముచూపకపోతే ఎట్లా? లేకపోతే మనము ద్రోహంచేసినవాళ్ళ మవుతాం.

ఈ బానిసలను, పాపము, పారిపోకుండా పట్టుకోండి! (పోతులు తేనెటీగలమీద పడి అల్లరి చేస్తూ ఉంటారు. ౧ వ పోతు ౧ వ తేనెటీగమీద, ౨ వ పోతు ౨ వ తేనెటీగమీద, ఈవిధంగా సంఖ్యల వరసను పోతులు తేనెటీగలమీద పడి హింసిస్తారు.)

౧ పోతు : పాపము, రాణిని విడిచిపెట్టి ఎప్పుడూ ఒక్క క్షణమైనా ఉండేదానివి కాదు. ఎప్పుడైనా అది నిన్ను ఇట్లా ముద్దుపెట్టుకుందీ?

౧ తే. ఈ : నీ నోరు పడ! నా పెదిమలు కొఱుకుతావేమిరోయి!

౨ పోతు : ఏడుస్తుంటే నీబుగ్గలు ఎంత బాగున్నవే, ఎఱ్ఱగా ఉబ్బి!

౨ తే. ఈ : ఏ మాగడం, నాబుగ్గలు గిల్లకురా వెధవా!

3 పోతు : ఏదీ, కళ్ళు తెరూ, చూస్తాను. అట్లా నీళ్ళు కారుస్తావేం?

3 తే. ఈ : నీదుంపతెగ! నాకళ్ళు రెండూ పొడిచావురా

౪ పోతు : నీచిన్న ఒళ్ళు నా కౌగిటిలో చక్కగా ఇమిడి పోయింది.

౪ తే. ఈ : నేను నలిగిపోతున్నానురోయి. నాకు ఊపిరి సలపడం లేదు. వదలరా, దణ్ణం పెడతాను నీకు!

౬ పోతు : నీవు మహా శాంతురాలివి గాని తేనె తాగు, ఇదుగో!

౬ తే. ఈ : తండ్రీ, నామీద ఎందు కట్లా ఉమ్మి వేస్తావు, రాణి పోయిన దుఃఖంతో అసలే ఏడుస్తుంటే ?

౭ పోతు : ఏమే, ఇందాక రాణితో మా అందరిమీదా పితూరీ చెప్పడానికి వస్తివే!

౭ తే. ఈ : అయ్యో, ఒళ్ళుఅంతా అట్లా కుమ్ముతావేం?

౮ పోతు : పితూరీచేసే తొత్తులకు నీవు చేసే శిక్షేరా!

౮ తే. ఈ : అయ్యో! - అమ్మో! నా రెక్కలు విరుగుతున్నవి, నాయనో!

౯ పోతు : పితూరీ చేయడానికి వస్తూంటే ఒక కాలు

విరగ గొట్టినాను కాదూ, ఇందాక? పక్షపాతం చేయు
రాదు పాపం నీకు! నీ రెండో కాలు నన్ను వదలిపెట్టినా
వేమంటున్నది. ఇదుగో!

౯ తే. ఈ: రెండవ కాలు కూడా విరిగిపడి చస్తినిరో,
నీ జిహ్వాపడ!

౫ పోతు: అరే, అరే, ఆగండిరా! మీరంతా ఈపడుచు
వాళ్ళతో సరసాలాడుతుంటే, ఈ ముసలిబంటు
చూడండిరా, నన్ను ఎట్లా తప్పించుకుంటున్నదో!

౫ తే. ఈ: [తప్పించుకుంటూ] మిడిసిపడకండి! మీ
కందరికీ పొయ్యేకాలము దగ్గిరికి వచ్చింది.

౫ పోతు: మన మిద్దరము సహగమనము చేదాము, —
ఏం?

౫ తే. ఈ: [చిక్కకుండా] నీ మగటిమి అంతా ముసలి
తొక్కనైన నామీద ఎందుకోయి! చిన్నరాణి
వస్తుంది, అప్పుడు చూపించు!

౨ పోతు : ఈ ముసలితొత్తుకు అన్నీ తెలుసురా ! చిన్న రాణీ బయటికి వచ్చేదాకా నీవు నారాశివి, ఏం?

౬ పోతు : [౨ పోతుతో] దీనికి సహగమనం కాదు పట్టి బోడిగుండు చేయాలిరా !

౫ వ తేనెటీగ మీదికి వస్తుంది

౨ పోతు : [౬ పోతుతో ] నీ సహాయం నాకేమి అక్కర లేదు లేవోయి !

౬ పోతు : ఈబింకంకూడా ఎందుకూ, ముసలిబానిసన పట్టుకోవడం చేతకాక పైపెచ్చు!

౨ పోతు : నీకేం మత్తెక్కి ఉన్నదా ఏమి!

౬ పోతు : [రోషంతో] ఆc! అందుకే ఇప్పుడు నీ ప్రాణాలు కొరికివేస్తాను

౨ పోతు : నాతడాఖా చూడు!

౨, ౬ పోతులు పోట్లాడుకుంటవి.

౧ పోతు : ఆ పోతు ముసలిదానితో ఆడుకుంటుంటే

మధ్య పీడ కెందుకు!

౨ పోతు : ఆ పోతు ముసలిబంటుకు తాలిబొట్టు కట్టి నాడా, ఏమన్నా దానికి ప్రత్యేకంహక్కు ఉండడానికి!

౧ పోతు : ఐనా న్యాయమూ అన్యాయమూ అక్కర లేదా!

౨ పోతు : మహా న్యాయం తెలిసింది నీకే!

౧ పోతు : [రోషంతో] ఆఁ ?

౧, ౨ పోతులు పోట్లాడుకుంటాయి.

ఒకపోతు పోయినదానివద్దకు ఇంకొకపోతు పోతూ ఒకపోతుతో ఒకపోతు పోతుంటే తమలో తాము పోట్లాడుకుంటూ ఉంటారు

౨ తే. ఈ : [సందడిలో తప్పించుకొని] బయటపడ్డాను తల్లీ! మీరంతా కూడా ఈ సందడిలో తప్పించుకుపో రండే!

ఆ రణరంగములో నుంచి తేనెటీగలు ఒకటొక్కటే బయటపడతవి.

౧ తే. ఈ :. [నిట్టూర్పు విడుస్తూ] ఇట్లా అయితే

ఈ పోతులలో ఇక బతికేదెట్లా!

౨ తే. ఈ : [మూతి ముడుస్తూ] నాకేమీ తోచడం లేదు !

౩ తే. ఈ: ఈ పాడుబతుకు బతికేకన్న చస్తేనే బాగుండేట్లున్నది.

౪ తే. ఈ : మనకు సుఖ మెందుకే ? దాస్యము చేయడమే మనసుఖం.

౫ తే. ఈ : సేవ చేయడమే మన కానందం. అదే మన స్వభావం. అయితే ఇక మనము సేవ ఎవరికి చేసేట్లు ?

౬ తే. ఈ : తేనె తీసుక వద్దాము పదండి !

౭ తే. ఈ : తల్లి లేకపోయినతర్వాత మన కింకా తేనె ఎందుకే ! ఈపాడుకట్టెలకు తేనెకూడా కావలెనటే !

౮ తే. ఈ : అబ్బా, కదలలేకుండా ఉన్నానే !

౧ తే. ఈ : అమ్మా !

ఏడుస్తూ రాణి దేహముమీద పడుతుంది. మిగిలినవి కూడా పడి

ఏడుస్తూ ఉంటవి.

౫ తే. ఈ : పోతులు పోట్లాడుకొని పోట్లాడుకొని ఇటు వస్తున్నారు. వాళ్ళ కివ్వాళ పొయ్యేకాలము వచ్చింది. మన రాణీదేహాము తినివేస్తారు. దూరంగా తొలగి తల్లిని వేడుకుందాము రండి !

౧ తే. ఈ : నాతల్లినే తింటారా ! నేను వదలను.

౨ తే. ఈ : [౧ వ తేనెటీగతో] రావే !

రెండూ పట్టుకొని రాణిదేహాన్ని వదలవు. పోతులు ఒక్కసారి రాణిమీద పడి ౧, ౨ తేనెటీగలతో సహా గబగబ తినివేస్తూ ఉంటారు. మిగిలిన తేనెటీగలు ఝుంఝుమ్మంటూ దూరదూరంగా గొడ చేస్తూ ఉంటవి.

తెరలో గంధర్వులు

నీ పాద దాసులమె జగదంబా
ఈ పోతురక్కసుల పొరిగొనవే !
పువుపువును యాచించి మేము కూర్చ
ఇవి మధువు నడుగంట త్రావివేసె!

నిర్వీర్యులము మేము నీవు లేక
దుర్విదగ్ధుల పీరి సోర్వగలమె!
నిన్న కూకిన పొద్దు నేడు మరల
మిన్నందె కిరణాల తమము విరియ!
నిరుడు పోయిన మధువు నేడు తిరిగి
తరుగుల్మముల పులకరింపజేసె!
మరల జన్మింపవే మాతల్లి!
మమ్ము పాలింపవే మాతల్లి!

౫ తే. ఈ: మన తల్లి మన మొర విన్నదే!

3 తే. ఈ: ఏమిటే అమ్మా?

౫ తే. ఈ: మన తల్లి అదుగోనే, మళ్ళీ పుట్టుకు వస్తున్నదే!

౪ తే. ఈ: ఎక్కడే?

౫ తే. ఈ: అదుగో, ఆ పెద్దగదిలో, కదులుతున్నది మన రాణేనే. మనంకూడా బయటినుంచి దారి చేదామే!

# తేనెపట్టె

తేనెటీగలన్నీ కొత్తరాణిగది పైభాగము కాళ్ళతో గీరుతూ దారితీస్తూ ఉంటవి.

౧ తే. ఈ : అదుగో బయటకు వస్తున్నది తల్లి! మన కష్టాలు గట్టెక్కినట్టే!

౨ తే. ఈ : చూడండి, కాస్తసేపులో మన తల్లి ఈ పోతుటీగలమీద ఎట్లా ప్రళయతాండవము చేస్తుందో!

౩ తే. ఈ : మత్తెక్కి తూలిపడుతున్న ఈ పోతులందరికీ ఒక్కసారిగా మత్తు వదిలిందే!

౪ తే. ఈ : మాతల్లి మహాకాళికవలె ఎంత భీషణ రమణీయంగా ఉన్నదే!

కొత్తరాణి ఝుమ్మని బయటికి వస్తుంది. తేనెటీగలు ఉప్పొంగి పోతూ ఝుమ్మని ప్రతిధ్వనిస్తవి.

తెరలో గంధర్వులు

జయ మధుకోశోద్ధత్రీ!
ఉన్మదమధుగణహంత్రీ!
జయ అళిలోకస్రష్ట్రీ!

౧ తే. ఈ : ఈ సోమరిపోతుల ముఖాలనుకూడా తల్లి కనపడగానే ఏదో వికాసము కలిగిందే!

౨ తే. ఈ : ఈ పాడుపోతుల కళ్ళలో వింతకాంతి ఏదో వచ్చిందే!

౩ తే. ఈ : ఇప్పుడు దుర్మార్గులను చూస్తే ఏదో గౌరవం కూడా కలుగు తున్నది!

౪ తే. ఈ : ఒక్క పెట్టున ఈపోతు లందరూ తల్లిమీద మూసుకు తున్నారు, చీల్చి వేయరుగదా మన తల్లిని!

౫ తే. ఈ : మన తల్లి పరమేశ్వరికి భయమేమిటి! ఆమె వెనక్కు తిరిగి ఎంతకోపిష్ఠిగా పోతులవైపు చూస్తున్నదో చూడండి!

౬ తే. ఈ : ఈ పోగరుబోతు లంతా ఆమె కటాక్షాల ముందు దాసానదాసులవుతున్నారు, ఏమి చిత్రము !

౧ పోతు : [రాణితో] నీ దర్శనమువల్ల నా జన్మ ధన్యమయింది.

౨ పోతు : నీ కటాక్షకింకరుడు వీడు!

3 పోతు : రాణీ, నీ కీ దీనుడిమీద దయలేదా !

౪ పోతు : నా రాణీ !

౫ పోతు : నీ పాదాలు నా శిరస్సుమీద ధరించనీ !

౬ పోతు : నీ కేమి కావలెనో చెప్పి వీణ్ణి రక్షించు !

రాణి వెంటనే వెళ్ళి రాణులు కాబోయే ఇతర రాణి గదులలో ఉన్న రాణీగుడ్లను పొడిచి వేస్తుంది.

3 తే. ఈ : తల్లి వెళ్ళిన ఆ గదులలో నుంచి అట్లా నెత్తురు వరదలు కట్టుతున్న దేం ?

౫ తే. ఈ : లోకానికి రాణి ఒక్కతేకాని బహుమంది ఉంటే మరి ఎట్లా ?

౬ తే, ఈ : కాబోయే రాణులను తల్లి చంపివేసింది కాబోలు !

౪ తే. ఈ : ఇప్పుడు పుట్టిన రాణికి అప్పుడే ఎంతజ్ఞానమే!

౫ తే. ఈ : ఇహ చూడండి రాణిమహాత్త్వము, ఈ పోతులను ఏమి ఆట ఆడిస్తుందో !

రాణి పైకి లేచి ఎగురుతుంది. పోతు లందరూ వెంట బడతారు.

౬ తే. ఈ : తాగి ఒళ్లు తెలియకుండా పడిఉండే ఈ పోతులను ఈ చురుకుదనము ఎక్కడనుంచి వచ్చిందే ?

౫ తే. ఈ : రాణి కనబడగానే వీటిలో పురుషత్వము విజృంభించింది.

౩ తే. ఈ : తల్లి వీటిని ఏమి ఆడిస్తున్నదే ?

౪ తే. ఈ : ఇన్ని పోతుటీగలలో ప్రతివాడికీ ఒక్కొక్క సారి అందుబాటులోకి వచ్చినట్లే ఉండి ఎవ్వరికీ అందకుండా పోతున్నది రాణి !

తెరలో గంధర్వులు

శాంకరీ పల్కు మీఝుంకార మేమిటో
మంత్రమా, గీతమా, మరి మాయయా ?
భ్రామరీ తెల్పుమీ భ్రమణవిభ్రమ మేమొ

లీలయా, నాట్యమా, లేక నటనా ?
ఒకరి చెవి జేరి ఇంకొకరి చే యూనెదవు
అందరికి దూరమై అటె దరిసెపే ?
ఒకని నవ్వించి ఇంకొకని నేడ్పించెదవు
ఒకని నిస్తబ్ధాత్మ నొసరించెదే !
ఇటనుండి ఉన్నట్లె మటుమాయ మౌదువే
మెరిపింతువే మరల దరిజేరుచున్ !
దురదృష్టవంతుల కదృష్టంబురీతిగా
అందినట్లే ఉండి అంధరావే !
సాధకుని ఆత్మలో జ్ఞానదీపమువోలె
కనుపించి మాయమై కనుపింతువే !
తెలియలేమే మేము ప్రలయమో ప్రభవమో
లాస్యమో తాండవమొ మము తేల్చవే !
శాంకరీ తెల్పు మీ ఝుంకార మేమిటో
మంత్రమో, గీతమో, మరి మాయయో !
భ్రామరీ తెల్పుమీ భ్రమణవిభ్రమమేమొ
లీలయో, నాట్యమో, లేక నటనో !

తే. ఈ : అంతమంది పోతులగుంపూ ఇంత సన్నగిలి పోయిందేం?

౨ తే. ఈ : వాళ్ళంతా రాణి పెట్టిన తిప్పళ్ళకు అలిసి కింద పడిపోయినారు. మళ్ళీ మనము కష్టపడి కూర్చిన తేనె తాగడానికి వాళ్ళిక రాలేరు. పోతు లందరూ ఆ పోయినవాళ్ళగతికే పోతారు.

౩ తే. ఈ : గొంతులో ఊపిరి ఉన్నంతవరకూ వీళ్లు రాణి వెంట పడుతున్నారు.

౪ తే. ఈ : ఒకరితర్వాత ఒకరు నేలకు పడిపోతున్నారే! ఒకరు, ఇద్దరు, ముగ్గురు, నలుగురు——

౫ తే. ఈ : అదేమిటి? —— మన తల్లి మరీ అంత పైకి పోతున్నదేం? ——మనకు మళ్ళీ కనపడేదెట్లా?

౬ తే. ఈ : ఫరవాలేదు కాని తల్లిని జాగ్రత్తగా కనిపెట్టి ఉండండి. ఆ పడే పోతుల శవాలే తల్లివెళ్ళినదారి మనకు చూపించగలవు.

౭ తే. ఈ : ఇదుగో పోతులు! ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది——

౧ తే. ఈ : తల్లి మబ్బుల్లోకి మాయమయింది.

౨ తే. ఈ : తల్లితో పాటు ఇందాక నన్ను తరిమిన హాస్యగాడుపోతు ఒక్కడుమాత్రము మబ్బులలోకి మాయమైనాడు !

౩ తే. ఈ : అయ్యో, మళ్లీ మన తల్లి మనకు కనబడే దెట్లా!

౪ తే. ఈ : మనము దిక్కులేని పక్షుల మైనాము మళ్లీ!

౫ తే. ఈ : కష్టసమయంలో కాస్త ఓర్పు ఉండాలి! తల్లి మబ్బులలోనుంచి దిగివచ్చేప్పటికి ఆమె ఒళ్లంతా సొక్కి పోయిఉంటుంది. ఆమె ఎక్కడున్నదో వెతికి మనము ఉపచరించవలె. చెదిరిపోకుండా పోయి వెదుకుదాము రండి!

**అన్నీ గుంపుగా రొదచేస్తూ బయలుదేరుతవి**

**తెరలో గంధర్వులు**

**తల్లీ, ఏపొద దాగితివే!**

మళ్లీ మా కెటు కనబడెదే!
కుహుకుహు కూసే కోకిలమా
ఎందే తల్లిని కంటివటే!
కిలకిల పలికే బుడుచిలుకా
ఎందే ఆంబను చూచితటే!
చిరుచివురుల నగు చూతమ్మా
నీలో రాణిని దాచితటే!
పువుదెర మరగిన గురులతికా
ఈదెస నంఒక వచ్చెనటే!
మధుమధురస్మిత మధుమూర్తీ
మదుకోశేశ్వరి ఎక్కడరా!
శింజిని ఝుంఝుమ్మను మదనా
అలికులరాజ్ఞిని పూన్చితివా!
సుమపులకితభాసురవేషా,
నిను ప్రసాద మర్థించెనటే!
తల్లి ఏపాద దాగితివే?
మళ్లీ మా కెటు కనపడెదే?

రాణి అలిసి పెద్దవేపచెట్టు ఆకులలో పూలమధ్య ఉంటుంది.

ఆమె దేహానికి గీవ పోతు దేహము అంటుకొని ఉంటుంది. తేనె టీగలు కలుసుకొని సంతోషంతో ముసురుకుంటువి.

౩ తే. ఈ : ఎంతసేపటికి కనపడ్డావు తల్లీ! నిన్ను ధరించిన ఈ వేపచెట్టు సాక్షాత్తుగా మహాలక్ష్మీ!

రాణి మాట్లాడదు

౪ తే. ఈ : నీకోసము మే మంతా ఎంత దిగులుపడ్డా మమ్మా!

రాణి మాట్లాడదు.

౫ తే. ఈ : తల్లి అలసిపోయి ఉన్నది. ముందు దాహము కావలె! కొంతమంది పోయి తేనె తీసుకురండి, త్వరగా !

కొ: ౨ తేనెటీగలు వెళ్లి పోతవి.

౬ తే. ఈ : నీ ఒళ్లు పట్టేదా ?

రాణి మాట్లాడేను.

౭ తే. ఈ : తల్లి ఒంటిమీద అదేమిటే!

౫ తే. ఈ : వీడి దుంపతెగా! నన్ను తరిమిన ఈ పోతు
తల్లిని పట్టుకు వదలకున్నాడే!

౧ తే. ఈ : వీడి నోటుపడా! చచ్చినా, వీడి మొహం ఎంత
కళగా ఉన్నదీ!

ఒక్క క్షణంలో రాణిని అంటుకుని పైకి కనబడుతున్న ౫వ పోతు
దేహాభాగము తేనెటీగ లన్నీ ముక్కలుచేసి రాణిదేహము శుభ్రము
చేస్తవి.

౯ తే. ఈ : అబ్బా కదలలేనే!

కదలడానికి ప్రయత్నించి పడి చచ్చిపోతుంది.

తేనెకు పోయిన ఈగలువచ్చి తేనె రాణికి తమముక్కులతో
అందించి దాహము తీరుస్తవి. రాణి పెదవులు కొంచెము కదుపుతుంది.

౫ తే. ఈ : [కన్నీళ్లతో] ఈ సంతోషము భరించలేను.

ప్రాణాలు వదలుతుంది.

మిగిలిన తేనెటీగలు అటువైపు కూడా చూడవు. అన్నిటికీ తెలివి వస్తున్న రాణివైపే దృష్టి ఉంటుంది

అంతా నిశ్శబ్దము.

రాణి : [శాంతముగా] పునఃసృష్టిచేసి ఈ నా లోకాన్ని పాలిస్తాను!

తేనెటీగ లన్నీ ఝుంఝుమ్మని జయనినాదాలు చేస్తూ తేనెపట్టె కాసుకాస్తగా తయారుచేస్తూ ఉంటవి. పట్టె పెట్టేవి కొన్నీ, అందులో మైనము కూర్చేవి కొన్నీ, తేనె తెచ్చేవి కొన్నీ— ఈవిధంగా పెద్దఫాక్టరీలో కూలీలగలె అన్నీ విశ్రాంతి లేకుండా పని చేస్తూ వుంటవి. రాణి గది గదికీ పోయి వరసగా గుడ్లు పెట్టుకు పోతూ ఉంటుంది.

తెరలో గంధర్వులు

ప్రళయావసానమున బ్రహ్మాండ మవియగా
ప్రభవించు నాత్మభవు డీరీతినే
చీకటులు విరియించి సృష్టించి లోకములు
శ్రీమించు నాత్మభవు డీరీతినే
భద్రములు వెలయించి పాపములు తూలించి
పాలించు నాత్మభవు డీరీతినే!

తెర

# పతంగయాత్ర

కైలాసగిరి కందరములో ఒక గుహ. క్రిందిభాగములో మునిపల్లె ఒకటి కనబడుతూ ఉంటుంది. ప్రొద్దుపొడుపుకు ఆరుగడియల ముందు. జటాయువు మేలుకొని ఉన్నాడు. ఎంత ప్రయత్నించినా అతనికి నిద్రపట్టడం లేదు. సంపాతి సుఖంగా నిద్ర పోతున్నాడు. ఇంతలో అతను నిద్రలో కాస్త కదిలినాడు.

జటాయువు : [రెక్కలు విదిలిస్తూ] అన్నా!

సంపాతి : [నిద్రలో] ఊఁ !

జ : అన్నా ! అన్నా ! ఇంకా మెళుకువ రాలా ?

సం : [బద్ధకంగా] ఊఁ !

జ : [అసహనంగా] తెల్లవారుతున్నది ఇంకా లేవవేమన్నా !

సం : [ఒళ్లు విరుచుకుంటూ కాస్త తల ఎత్తి చూసి ఆవలించి మళ్ళీ పడుకుంటూ ] ఇంకా కాస్త నిద్రపోయే పొద్దు ఉన్నట్లున్నదే !

జ : నాకు నిద్ర పట్టడం లేదన్నా !

సం : [శ్రద్ధతో] ఏం తమ్ముడూ ?

జ : మనస్సు అంతా ఏదో కలవరంగా ఉన్నది.

సం : [కళ్ళు నులుముకుంటూ లేచి ఆదరంగా] ఎందుకోయి నాయనా ?

జ : ఏమో, తెలియదు, అన్నా ! ఒళ్ళంతా ఛురుకు చురుక్కు మంటూ ఉంటుంది. రక్తనాళాల నిండా నెత్తురుకు బదులుగా అగ్నిజ్వాలలు ప్రవహిస్తున్నవా అనిపిస్తున్నది. అసలీ దేహామే ఒక పెద్ద ప్రళయాగ్ని గోళంగా మారిందేమో!

సం : నిజంగానా? ఎంత చక్కని బంగారపు ముద్దవోయి నీవు! అగ్ని స్పర్శవల్ల మేకువంటి నీ దేహాము మెరుగెక్కుతుందిలే.

జ : ఈ తాపము భరించడ మెట్లా!

సం : నిన్న నేను చాలు లేరా అంటున్నకొద్దీ వినక, వేకువ

నుంచీ చాలా పొద్దుపోయేదాకా, విరామం లేకుండా ఒకటేవిధంగా యెగురుతుంటి వాయెను హిమవంతము మీంద! ఒళ్ళేమైనా బడలిక చేసిందేమో !

జ : ఇంతమాత్రానికేనా? మరీ చీకటి పడి కళ్ళు కనపడక ఎగరడము చాలించాను గాని, అంతసేపు ఎగిరినా నాకు రవ్వంతైనా అలుపే రాలే దన్నయ్యా — ఇంకా ఎగురుదామనే ఉంది!

సం : మ రేమిటి తమ్ముడూ, ఐతే!

జ : నారెక్కల దురద ఏమీ తీరటంలేదు. రాత్రల్లా నీవు హాయిగా నిద్రపోతూ ఉంటే, నా కేమాత్రం నిద్రే పట్టలేదు. నారెక్కలు ఈగుహలో నిలవకుండా ఉన్నవి. ఒకటే లేచి లేచి పోవడము పైకి.

సం : కాస్త శాంతించవలెనోయి వత్సా !

జ : శాంతించడము ఎట్లా అన్నయ్యా! మొన్న మనమూ తుపానులో మహాసముద్రముమీద షికారు కొట్టితిమే

ఆ గాలివానకు పొంగి పొర్లుతున్న సముద్రుడికి ఏమన్నా శాంతి ఉందా? ఆ సముద్రమల్లే నా దేహమంతా ఉబికి పడుతుంటే శాంతి లభిస్తుందా!

**సంపాతి జటాయువు దగ్గరకు వాత్సల్యముతో వెళ్ళి వీపున చేయి ఉంచుతాడు.**

జ : [హాయిగా మైమరచి] అన్నా!

సం : తమ్ముడూ!

జ : ఎంత చల్లగా ఉన్నదన్నా నీ కరస్పర్శ! నీచేతి బరువుతో నా హృదయంలో బరువు ఉపశమిస్తున్నది.

సం : [నిమురుతూ] ఇప్పుడెట్లా ఉంది, బాధ?

జ : మలయపర్వతంమీద మనము ఎగిరిపోతున్నప్పుడు చల్లని చిన్న చేతులతో వాయువు మనలను నెమ్మదిగా దువ్వుతూ ఉంటాడే, అంతకంటేకూడా నీ స్పర్శ హాయిగా ఉన్నది అన్నయ్యా!

సం : [సంతోషముతో] ఎంత ముద్దుల తమ్ముడవోయి !

జ : నిన్న నే,—నేనుహిమవంతములో కాంచనగంగమీదికి పోయి అక్కడ కాస్తసేపు విశ్రమించినాను. అప్పుడు ప్రాలేయము దూది పింజలవలె తెల్లగా ఒంటినిండా కురిసింది. నా ఒళ్ళంతా కప్పుపడి ఈ కైలాస శిఖర మున్నట్లు ధళధళలాడింది. అప్పు డున్నంత చల్లగా ఉంది నా ఒళ్ళిప్పుడు!

సం : పిచ్చి తమ్ముడా! — చూడు, ఈ ఉషఃకాలము ఎంత మనోజ్ఞముగా ఉన్నదో. గిరికందరా లన్నీ శకుంత రుతములతో ప్రతిధ్వనిస్తున్నవి. నిద్రపోతున్న మునిపల్లె మేలుకున్నది. లోకమంతా సందడిగా ఉంది.

జ : ఎఱ్ఱదామరవంటి నీ దేహముమీద ఈ ఉషఃకాంతి పడి ప్రతిఫలిస్తూ ఉంటే, సాక్షాత్తుగా ఉదయిస్తున్న సూర్యభగవానునివలె ఉన్నావన్నా! నా కిప్పుడు బాల భానుడి సన్నిధానములో ఉన్నట్లే ఉన్నది.

సం : సూర్యుడంటే అశోక పుష్పమో దొండపండో అను

కుంటున్నావు కాబోలు, ఇక్కడనుంచి చూసి.
ఆయన మహా ప్రళయాగ్నిగోళ మోయి !

జ : [సంపాతి రెక్కలు తడువుతూ] అన్నయ్యా! నీరెక్కలు రెండూ బదరీనాథాలయంలోని కంచు ఘంటలకంటె గట్టివై, కండలు తేలి విశాలమైనవిగా ఉన్నవే! ఈ భూలోకము దాటే పోవేమన్నా?

సం : ఎక్కడికి వెళ్ళేదోయి !

జ : [సంపాతిముక్కు పుణుకుతూ] నీముక్కు ఉక్కు కన్నా కఠినంగా ఉన్నా, అది సరిగా ప్రయోగించవేమన్నా ?

సం : ఏం జేసేది తమ్ముడూ ?

జ : [సంపాతిమెడ నిమురుతూ] అన్నా, గంగా యమునా నదులు పుట్టిన హిమవంతములోని కోనవలె నీమెడ ఇంత విశాలంగా ఉన్నా, అందని మ్రాని పళ్ళకోసము నీ వెప్పుడూ అర్రు చాచవేమన్నా ?

సం : దేనికోయి మరి?

జ : ఈ బలమంతా ఏమిచేసుకోను నీకు?

సం : [చిరునవ్వుతో] ఐతే ఏం జేతామోయి ?

జ : నా ఒంట్లో ఈ బద్ధకమంతా తీరే దెట్లా ?

సం : నాతో మల్లయుద్ధం చేతువుగాని, లే !

జ : నీతో మల్లయుద్ధమేమీ లాభం లేదన్నా!

సం : [నవ్వుతూ] ఏం?

జ : నామీద అపేక్షచేత నన్ను గట్టిగా నీవు రెక్కలతో చరచనే చరచవు. నీ రెక్కలు నా ఒంటికి తగిలిన విసనకర్రతో విసరుతున్నట్లు చక్కలిగింత కలుగుతుంది. ఆ ఇనప ముక్కుతో నన్ను నీవు పొడుస్తుంటే, ముద్దు పెట్టుకుంటున్నట్లు ఉంటుందే కాని పొడిచినట్లుగానే ఉండదు.

సం : నీవు మాత్రమో మరి! నాతో మల్లయుద్ధము చేస్తూ ఉంటే, నీవు 'నన్ను కొట్టు, నన్ను పొడిచి

చీల్చివేయు' మని అంటూన్నట్లు ఊరికే నిలుచుంటావు
గాని, సరిగ్గా పోట్లాడుతున్నట్లే ఉండవాయె !

జ : అవు నన్నా ! పూజ్యపాదుడ వైన నిన్ను ఆటలో
మాత్రము ఎట్లా కొట్టగలనోయి !

సం : మ రైతే సంజేతామో నీవే చెప్పు, పోని. మళ్ళీ
హిమవంతము ప్రదక్షిణము చేతామా ?

జ : ఎబ్బె !

సం : వింధ్యము చుట్టివత్తామా?

జ : అన్నా, నీ వొక హిమవంతమ వయితే నే నొక
వింధ్యమను. నీవు అరుణాద్రివయితే నేను హేమాద్రిని.
మనకు ఈ పర్వతాల చుట్టూ గిరగిర తిరగడము ఆత్మ
ప్రదక్షిణము చేసుకున్నట్లే ఉంటుంది.

సం : పోనీ మలయ పర్వతము మీాదికి పోతే నీ హృదయ
జ్వరము శాంతిస్తుందేమో !

జ : [మూతి విరుస్తూ] ఛీఛీ !

సం : పోనీగాని మేరుపు మూడుసార్లు ప్రదక్షిణము చేసి వస్తాములే ఇవ్వాళ. లే, మరీ !

జ : ధీరుడవైన నీవు ఇంత అల్పసంతోషివే మన్నయ్యా !

సం : [విసుగుతో జటాయువు వీపుమీద చేయితీసి ఇవతలకు వచ్చి] ఇక నా బుద్ధికి ఏమీ తోచడం లేదు! ఏంజేదా మంటావో చెప్పుమరి.

జ : [అకస్మాత్తుగా దీనంగా] నిన్ను విడిచిపెట్టి ఉండలేనన్నా !

సం : [ఆశ్చర్యంతో] ఇక్కడే ఉంటేసి గాదటోయి !

జ : ఏదో పరాకుగా అట్లా అన్నానుగానీ, ఈ ఆవేదన తీరేదెట్లా అన్నా ! — ఇటువంటి పాడుమాట నా నోట వచ్చిందేమి చెప్మా!—పోనీగానీ, నాగపాశాల వంటి నీరెండు చేతులతోను నన్ను దృఢంగా బంధించి నుసినుసి అయ్యేట్లు నలిపివేయ రాదూ? అప్పటి కేమన్నా ఈ హృదయభారము శమిస్తుందేమోను !

సం : ఎందుకోయి?

జ : మొన్న వృత్రాసురుడి మహాకాయాన్ని దేవేంద్రుడు ఖండించినట్లు, వజ్రాయుధం వంటి నీ ముక్కుతో నా ఒళ్ళంతా తూట్లుతూట్లు పడేట్లు పొడిచివేసి, తీక్ష్ణమైన నీ ఉక్కు గోళ్ళతో ఒంట్లో మాంసపుకండలు వచ్చేట్లు నన్ను రక్కి చీల్చివేయలేవూ?

సం : [నవ్వుతూ] ఏమిటోయి ?

జ : సంపాతిఅన్నా, ఆగోత్రభేది పర్వతాల రెక్కలు నరికి వేయకముందు, పర్వతరాట్టుకు ఉన్న రెక్కలలాంటి నీ విస్తారమైన రెక్కలతో, నా వీపంతా ముక్కలు ముక్కలుగా బద్దలుచేద్దూ, కాస్త !

సం : నీకేం మతిపోలేదు గదా !

జ : నాకూ అదే అనుమానం ! నా తలనిండా అస్త మానమూ మంచుముద్ద కూరినట్లు దిమ్ముగా ఉంటుంది. సూర్యభగవానుని కాంతికి భయపడి పారిపో

యిన లోకాల చీకటి అంతా నా గుండెల్లో వచ్చి దాక్కున్నట్లుగా ఏదో అయోమయంగా ఉంటుంది. నా రెక్కలు గాలిపోసుకున్నట్లు పైకెగరగొట్టుకుపోతూ ఉంటవి. కాళ్ళల్లోనూ గోళ్ళల్లోనూ ఎప్పుడూ పురుగులు తొలుస్తూ ఉన్నట్లు నన్నెక్కడా ఒకచోట నిలవనీయవు. ఇదంతా ఎందువల్లనై యుంటుంది చెప్మా! ఉన్మాద మేమో!

సం : [చిరునవ్వు నవ్వుతాడు]

జ : ఏమిటన్నా, అట్లా నవ్వుతావు! నువ్వు నవ్వుతుంటే నాకు ఏడుపుకూడా వచ్చేట్లు ఉన్నది.

సం : [ముసిముసి నవ్వులు నవ్వుతూ ఉంటాడు.]

జ : గట్టిగా ఏడుపన్నా వస్తే బాగుండును! గంగావతరణానికి ముందు హిమవంతుడి గర్భమునలె నామనస్సు నిండుకొని ఉన్నది. వరదలో పొంగిపారే కృష్ణానది వలె కన్నీళ్ళ ప్రవాహం కారుస్తేనన్నా, కాస్త తేలిక

ఇష్టం దేమో! — నా అవస్థకు జాలి ఐనా లేకుండా
అట్లా నవ్వుతా వేమన్నా!

సం ; [నవ్వు ఆపుకోవలెనని ప్రయత్నిస్తూ] ఆఁ! - ఏమీ
లేదు లే.

జ : మ రేమిటి!

సం : మ రే!—మ రే!—[సంశయిస్తాడు.]

జ : [ఆతురతతో] ఏమిటన్నా! ఏమిటన్నా!

సం : ఏమీ లేదు. మ రే!—ఊఁ!— నీవు ఇప్పుడుపడే
అవస్థే—నేనూ ఒకప్పుడు పడ్డదేనోయ్!

జ : ఆఁ? ఆఁ? ఇంత అవస్థా?

సం : ఇంత అవస్థా, మరీ ఇంకా ఇంత అవస్థా!— అది
వర్షాకాలము! నీవు అప్పుడు మాటలన్నా రాని పసి
వాడివి. ఇట్లా నా గోడున చెప్పుకుంటే వినేవాళ్లైనా
ఎవరూ లేరు.

జ : నిజంగానా? ఎట్లా భరించావన్నా?

సం : ఇవిప్రతిప్రాణికీ సహజమేనోయి. ఇంతసర్వసామాన్యమైనా, ఎప్పటికప్పుడు ఎవరికి వారికి కొత్తగానే ఉంటుంది. సృష్టివైచిత్ర్యము!

జ : నీమాటలు నాకు ఒక్క ముక్కయినా అర్థం కావడం లేదు.

సం : ఆరోజున ఆకాశంనుంచీ మేఘుడు ధారాపాతంగా వర్షం కురుస్తున్నాడు. ఈదురుగాలి జీవులను వణికించి వేస్తున్నది. అట్టి సమయంలో నాహృదయంలో బడబానలంవలె తాపము ఎగబాక మొదలుపెట్టింది.

జ : [నోరు తెరుచుకొని కళ్ళు పెద్దవిగా విప్పి] అయితే ఏమయింది అన్నా?

సం : ఆగాలీ ఆవానా ఉరుములతో మెరుపులతో మహా భయంకరంగా ఉన్నది. ఆ బాహ్యప్రకృతికంటే నాఅంతః ప్రకృతి మరింత భయంకరంగా ఉన్నది.

జ : అయితే?

సం : అట్లా మూడురాత్రిళ్లూ మూడుపగళ్ళూ నిద్రాహారాలు లేకుండా ఉన్నాను. పాపము ! నీవు ఆహారము పెట్టే దిక్కులేక ఆకలివేసి ఏడ్చి ఏడ్చి, చివరకు నిస్త్రాణవల్ల కునికిపాట్లు పడసాగినావు. ఐనా నీసంగతే నా కప్పుడు తలకెక్కలేదు.

జ : ఏంజేశా వప్పుడూ?

సం : జ్వరతాపమువలే ఒళ్ళంతా ఉడుకెత్తి పోయింది. ఊరికే ఎడాతెరిపిలేకుండా 'కూఁ, కూఁ, కూఁ, అని బిగ్గరగా మూలుగు సాగించినాను. నా మూలుగుతో ఈ కైలాసగిరి గహ్వరాలన్నీ ప్రతిధ్వనించినవి.

జ : నీతపన ఎట్లా శాంతించిందీ, చివరకు?

సం : వినూ, మరి. చాలాసేపు నేను మూలుగుతుంటే, దానిప్రతిధ్వనిన్నీ, పైనుంచిపడే పిడుగులమోతా, తప్ప మరేమీ వినపడలేదు. కొంతకాలానికి, నామూలుగూ

దాని ప్రతిధ్వనీ అణిగి పోగానే, ప్రతిధ్వనికి ప్రతిధ్వని వలే, ఆవర్ష పు ధారలమీదుగా దూరాన్నుంచి నా మూలుగులాంటి మూలుగే వినిపించసాగింది. చాలా సేపటిదాకా అది నా మూలుగు ప్రతిశబ్దమేకదా అనుకొని ఊరుకున్నాను.

జ : తర్వాత, తర్వాత?

సం : ఒక్కొక్కసారి ఆమూలుగు, నాదానికంటే ఉచ్చస్థాయిలో వచ్చి, సంగీతమల్లే చెవుల్లో అమృతస్రావము కలిగించి, అప్పటికప్పుడు చిత్రంగా మనశ్శాంతి కలిగిస్తూ వచ్చింది.

జ : అంతసేపూ అట్లాగే మూలుగుతూ పడి ఉన్నావా?

సం : లేదు. మాంద్యంగా మూలుగుతూ పడిఉన్న నాకు, దుర్దినంలో అకస్మాత్తుగా కనిపించిన సూర్యకిరణము వలె, అది ఎవరిదో నావలెనే ఉన్మత్తరుతము అని అనిపించింది. వెంటనే నేను ఒక్కసారిగా, కర్ర తగిలిన కోడెత్రాచువలె, రివ్వున పైకి లేచాను. ఆలోచించ

కుండా బాణవేగముతో ఆకూజితము వస్తున్న వేపుకు ఒక్కటే దీర్ఘప్లుతస్వనం చేసుకుంటూ ఎగిరి పోతు న్నాను. అది కూడా 'కూ ఊ ఊ ఊ ఊ ఊఁ!' అంటూ అట్లాగే ఒకటే ఉచ్చైస్స్వనంతో నా అంత వేగంతోనే నావైపుకే ఎగురుకుంటూ దగ్గర దగ్గరకు వస్తున్నది. మాకు అన్యోన్యదర్శనము కాకముందే మా షడ్జస్వరాలు రెండూ ఏకమై శ్రావ్యముగా భూన భోంతరాళము నిండి ప్రతిధ్వనించినై.

జ : [ఆశ్చర్యముతో] ఏమిటన్నా అది ?

సం : [చిరునవ్వు నవ్వుతూ సందేహిస్తాడు.]

జ : చెప్పక అట్లా నవ్వుతావేమన్నా !

సం : అవునోయి ! ఆనాడే ఈకైలాసశిఖరాగ్రముమీదనే నాకు నా సహచరియొక్క ప్రథమదర్శనమైంది. అలకా పట్టణంలో ఏ యక్షవియోగినికో ప్రియసందేశము తీసుకొని పోతున్న ఆ ఆషాఢమేఘుడే సాక్షిగా,

ఆ మేఘగంభీరగర్జనములే ఆశీర్వాక్యములుగా, ఆవర్ష ధారలే మంత్రాక్షతలుగా, మాకు ఇద్దరికీ ప్రథమ సమాగమ మయింది. ఆ సిమ్మట వేలితో తీసి వేసినట్లు నా తాపమంతా ఒక్కసారిగా ఉపశమించింది.

జ : [పేరాశతో ఉన్న వానికి అకస్మాత్తుగా నిరాశ కలిగినట్లుగా నిట్టూర్పు పుచ్చి పట్టలేని చిరాకుతో] ఇంతేనా, అన్నా! - ఐతే నాకు కూడా ఇది అటువంటి తాపమే అంటావా?

సం : అవును, బహుశ.

జ : నాకట్లా తోచడం లేదన్నా!

సం : ఎందువల్ల?

జ : పెంటిపక్షులతో సాహచర్యముచేసిన అనుభవము నేనూ కాస్త ఎరుగుదునన్నా! కాని—

సం : [మాటకు అడ్డువచ్చి ఆశ్చర్యముతో] ఏమన్నావు?

జ : [జంకకుండా] అవునన్నయ్యా! అటువంటి అనుభూతిలోకూడా ఒక చిత్రమైన పారవశ్యము తాత్కాలికంగా కలుగుతుందని ఒప్పుకుంటాను. కాని అదేమీ నాకు తృప్తిగా లేదన్నా. పైగా నాకందువల్ల ఈ భూలోక పతంగాలమీద విరక్తికూడా కలిగింది.

సం : [మూతి బిగించుకొని] నీమాటలు నాకు చిత్రంగా ఉన్నవే.

జ : [బ్రతిమాలు గొంతుతో] అవును అన్నయ్యా! — నేను చేసింది ఏమైనా తప్పయితే దాసుని తప్పు క్షమించు. అన్నయ్యా! నీ కిదే నమస్కారము!

సం : [ప్రసన్నుడై] తప్పేమిటికాని ఎంతవాడివిరా!

జ : ఏమున్నదీ ? సకలప్రాణి ధర్మము!

సం : అట్లాఅయితే, నే ననుకొన్నట్లుగా నీ అశాంతికి ఇది కారణము కాకపోవచ్చు. నీవు మొదటినుంచీ చిత్రమైన ఊహాలు కలవాడవు. నీవు ప్రాకృతవ్యక్తివి కాదోయి.

జ : నాకదేమో తెలియదుకాని మృణ్మయమైన ఈలోక
మంటే నా కిష్టములేనిమాట వాస్తవము.

సం : నీవు నీపసితనంనుంచీ యింతేనోయీ. అన్నీ అసాధ్య
మయినని కావలెనని కోరేవాడివి. ఆకాశమంతా ఒక
పెద్దచెట్టు అనుకొని, అందులో చంద్రుణ్ణీ నక్షత్రాలను
సూర్యుణ్ణీ కోసి తెచ్చిపెట్టమని నన్ను ఏమి ఏడిపించే
వాడి వనుకున్నావు ?

జ : అన్నా, నిజంగానా ? ఐతే ఒకమాట చెబుతా,
నవ్వవుకదా !

సం : ఊఁ !

జ : మరే—ఇప్పుడుకూడా నాఊహలన్నీ అంతే అన్నా!
నే నెప్పుడు కలగన్నా చంద్రమండలానికీ నక్షత్ర మం
డలానికీ సూర్యమండలానికీ ఎగిరి పోతున్నట్లుగా కలలు
వస్తవి కాని, హిమవంతమూ వింధ్యమూ కలల్లో రావు.

సం : మనశ్శక్తికి మించిన ఊహాలు పనికిరావోయి

నాయనా! అత్యుచ్ఛ్రయము పతనహేతువు అని పెద్ద లంటారు కాదూ?

జ : పెద్దలేమైనా అంటారు కాక! ఎప్పుడూ నేలమీద ఉండేవాడు ఎట్లాపడతాడు? పైకెక్కినవాడే పడేది. పైకెక్కడము ప్రధానముగాని, ఎక్కినతర్వాత ఒకవేళ పడితే మాత్రమేమి నష్టమన్నా ? ఈపాడునేలలో ఎప్పుడూ పడిఉండి బురదలో పురుగుల వలె కుళ్ళుతూ ఉంటేమే లంటావా ?

సం : అది కాదోయి. మనశక్తికి మించిన ఊహాలు మాత్రము ఉండరాదు.

జ : హనుమంతుడికి వలె నీ శక్తి నీకు తెలియదన్నా. కామరూపులమైన నీవూ నేనూ తలచుకుంటే మనకు అసాధ్యమైనకార్యము ఏముంటుంది.?

సం : కాస్త అణకువ ఉండవలె నోయి.

జ : ఈ ముసలివాళ్ళమాటలు నీ కెట్లా పట్టుపడ్డవన్నా !

ఈనీతివాక్యాలు నన్ను కుంగదీస్తవి. ఉత్సాహాతిశయములో మధ్యమధ్య కాస్త ఒళ్ళు మరిచిపోకపోతే ఎట్లా?

సం : నాకు పాలపొంగు అణిగి పోలేదటోయి మరి!

జ : నీకా? నీకున్న శక్తిసామర్థ్యాలు ఇంకా ఎవరి కున్నవో చెప్పూ, చూద్దాము.

సం : కాదోయి. మనకు ఏ శక్తి లేశమున్నా, అదంతా ఆ పరమేశ్వరుని కటాక్షలేశమే అనుకోవలె. మనదని గర్వించరాదు.

జ : నీ దేహము ఎంత బలవంతమైనదో నీ మనస్సు అంత దుర్బల మైన దేమీ? ఉత్తమమైన ద్విజజాతికి పరమేశ్వరుడ వైన నీకంటే వేరే పరమేశ్వరుణ్ణి నే నెరగను.

సం : అట్లా అనరాదోయి. చూస్తూ, అరుణోదయవేళ ఐనది. ఆకాశమంతా ఎర్రపడ్డది. పూజ్యులైన తాత పాదులను ధ్యానిద్దాము.

సంపాతీ జటాయువూ ధ్యానిస్తారు.

సం : ఒకమాట చెబుతాగాని వింటావూ?

జ : చెప్పూ—ఈ అశాంతి తగ్గే ఉపాయమేమైనా చెబుదూ?

సం : నీ కెప్పుడూ ఉన్నతపదవి మీద దృష్టి ఉంటుంది కాదూ?

జ : కొంతవరకట్లాగే !

సం : ద్విజరాజ్యానికి నీకు యావ రాజ్యము కడతాను. లేకపోతే నీవే ద్విజరాజ్యము చేస్తూ ఉంటే, నేను తపస్సు చేసుకుంటూ చూసి సంతోషిస్తాను.

జ : [చెవులు మూసుకొని] అన్నా, నామీద కోపము వస్తే శిక్షించడానికి వేరే మార్గము నీకు కనపడలేదా, ఈవిధంగా ములుకులవంటి మాటలు ఆడకపోతే?

సం : నాకేం కోపము ? నీయందు ప్రేమాతిశయమువల్ల అంటూ ఉంటే!

జ : అన్నా, ఉన్నతపదవి అంటే, నీ కుమారుడు పొంద వలసిన యావ రాజ్యమూ, అన్ని విధాలా శ్రేష్టుడ వైన నీ రాజ్యమూ నేను కాజేయ వలెననా నేను కోరుకొనేది? నీ తమ్ముడికి అంత అల్పబుద్ధి కలుగు తుందా?

సం : ఊరికే అపార్థము చేసు కుంటావేమిా? నాకు నీవంటే భేదబుద్ధి లేనే లేదు.

జ : కాదులే అన్నా ! నీ మనస్సుకు నేను పొరపాటున ఏదో కష్టము కలిగించి ఉంటాను. లేకపోతే నాతో యిట్లా మర్మచ్ఛేదకంగా మాట్లాడి ఉండవు. నా తప్పుకు శిక్షగా నే నీరోజు ఈ గుహలోనుంచి ముడు చుకొని బయటికి కదలనే కదలను. [అని కాయ మంతా ముడుచుకుంటాడు.]

సం : ఏమిటి ఈ పిచ్చివేషాలు! ఇవ్వాళ వాయుమార్గం దాటి శుద్ధ ఆకాశంలో తిరుగుదాము రా, లే!

జ : రాను క్షమించు అన్నా !

సం : నా చిన్నతనంలో ఒకసారే—ఒంటరిగానే — చంద్రమండలానికే— ఎగిరి పోయినాను.

జ : [ఆశ్చర్యంతో కళ్ళు తెరిచి తల ఎత్తి] నిజంగా?

సం : కొంత పైకి ఎగిరిపోయిన తర్వాత దిక్కులే తెలియ లేదు. ఆ పైన రాత్రేదో పగలేదో తెలియక కాలమానమే పోయింది. చంద్రమండలము ఎన్నాళ్ళకు చేరానో చెప్పలేను. నామనస్సుకు మాత్రము అది ఒక యుగముగా తోచింది.

జ : [ఆశ్చర్యంతో] అన్నా !

సం : చలి అంటే ఏమిటో ఈ లోకంలోవాళ్లకు ఏం తెలుసును ! మనకు ఇక్కడ తెలిసిన చలి హిమపర్వతంలో చలికాలంలో గడ్డలు కట్టుకొనిపోయే చలేగా ?

జ : మరి అక్కడ ?

సం : అక్కడ ? ఆ చలి అనుభవిస్తేనేగాని, చెబితేనూ

వ్యాపిస్తేనూ తెలిసేది కాదు. అంత చలి వేస్తుంటే, అది చలో ఒళ్ళు కాలిపోయే మంటో కూడా తెలియకుండా పోయింది. నిద్రాహారాలు లేకుండా ఎన్నాళ్ళో వెళ్లి వెళ్లి ఒళ్ళంతా ఉడుకెత్తిన నాకు, అక్కడికి వెళ్ళగానే ఒక్కసారి ఒళ్లంతా బిగుసుకుపోయి కట్టె వారింది. ఒంట్లో నెత్తురు పారకుండా నిలిచిపోయింది. రెక్కలు అసలే ఆడలేదు, స్మృతితప్పి పడిపోయినాను.

జ : ఎంత అదృష్టశాలి వన్నా! చంద్రమండల యాత్రే చేశావా, నిజంగా?

సం : అదృష్టశాలినే కాకపోతే మళ్ళీ ఇక్కడికి జీవంతో ఎట్లా వచ్చాను! ఈ లోకంలోకి మళ్లీ నాశక్తివల్లగానీ నా ప్రయత్నం వల్లగానీ నేను రాలేదు. ఆ భగవంతుడే ఆ పడిపోయిన కట్టెను ఇక్కడ తెచ్చి పడవేశా డనుకుంటాను. నాకు చంద్రమండలము వద్ద పోయినస్మృతి మళ్ళీ ఈ కైలాసశిఖరం మీదనే వచ్చింది. నాకే చిత్రంగా ఉంది.

జ : అంత యాత్ర చేసిన తర్వాత జీవిస్తే ఏమి, జీవించక పోతే ఏమి! నీ వెంత గొప్పవాడివి వన్నా !

సం : నా కిక్కడ ఒళ్ళు తెలిసిన తర్వాత నిద్రపోయి లేచిన వాడినల్లే ఉన్నానే గాని ఏమీ బడలిక లేక పోయింది. కల గన్నానేమో అనుకున్నాను. కాని ఇక్కడి ఋషు లంతా వచ్చి నన్ను చంద్రమండలము వెళ్ళి వచ్చినందుకు అభినందించి చిరంజీవి వైనావని ఆశీర్వదించారు. ఆ యాత్ర నాకు నెలరోజులు పట్టిం దన్నారు. అప్పటినుంచీ నాకు ఆకలి దప్పీ లేవు.

జ : చంద్రమండలములో అమృత ప్రాశన చేసి ఉంటావు!

సం : కావచ్చు. కాని మళ్ళీ ఆ తర్వాత ఈ భూలోకము వదిలిపెట్టి మరోలోకము వెళ్ళడానికి ధైర్యము చాల డం లేదోయి.

జ : నేను అసమర్థుణ్ణాయి ఎప్పుడూ ఇట్లా మూలపడి ఉండ వలసినవాణ్ణే, టవాంధమల్లే. ఈదౌర్భాగ్యపుజన్మ

ఎందుకు ఎత్తినా నన్నా !

సం : నీ కేం కర్మమోయి! నాకంటె నీవు ఎక్కువవాడివి కాని ఏ మాత్రమూ తక్కువ కాదు. బంగారం వంటి నీ దేహకాంతి చూడూ. పోనీ ధైర్యం చేస్తాను కాని, మళ్ళీ—చంద్ర లోకానికి పోదాము రా. చంద్రమండలములో చంద్రకాంతి నీ బంగారపు రెక్కలమీద పడితే, ఆ వెన్నెట్లో మెరుపువలె నీవు ప్రకాశిస్తావు. నీవు కూడా చిరంజీవి వవుతావు, లే!

జ : చిరకాలము జీవించి ప్రయోజన మే మన్నా! బ్రతికి ఉన్న నాలుగు నాళ్ళూ గొప్పగా పేరు ప్రతిష్ఠలతో బ్రతకవలె గాని ! ఇవ్వాళ నేను ఇక్కడనుంచి కదలను అన్నయ్యా!

సం : అదేమిటోయి! నీకోసమని ఇవ్వాళ సాహసిస్తాను. నక్షత్రమండలానికి పోయి, ఆ నక్షత్రాలు ముక్కులతో పొడుచుకు తెచ్చి, చంద్రకిరణాలతో

గుచ్చి హారం కట్టి నక్షత్రమాల ఈశ్వరుడికి అర్పించు దాము, రా! చెప్పిన మాట విని, లే!

జ : ఏమైనా చెప్పు! అన్న మనస్సు నొప్పించిన ఈ పాపిష్టివాడు ఇవ్వాళ ఇక్కడనుంచి లేవడు.

సం : ఛా! నాకేమీ నొప్పి కలుగ లేదంటూఉంటే అసహ్యంగా కోపం వచ్చేట్లుగా మొండిపట్టు పడతావేమి? లే!—పోనీ గాని, ఇవ్వాళ నీ వెక్కడికి పోదామంటే అక్కడికి నేను సిద్ధము; నీవేమి చేదామంటే దానికి తయారు!

జ : నామీద ఇవ్వాళ నీకు కోపం రాలేదు కదా, నిజంగా?

సం : రాలేదు, నిజంగా.

జ : ముమ్మాటికీ ?

సం : ముమ్మాటికీ !

జ : నేను ఎక్కడికి రమ్మన్నా అక్కడికి నిజంగావస్తావా ?

సం : ఆ, వస్తా!

తెరలో మునీశ్వరులు

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥ ౪.

ఒక్క క్షణము నిశ్శబ్దము. మళ్ళీ తెరలో మునులు.

ఉద్యంత మస్తంయంత మాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ త్సకలం భద్ర మశ్నుతేఽ సావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద । అసావాదిత్యో బ్రహ్మ॥

జ : [ఆలకించి చివాలున లేచి] ఆ మునీశ్వరులంతా ఏమి చేస్తున్నారో చూచావా ?

సం : మునీశ్వరులా, సూర్యభగవానునికి అర్ఘ్యమిచ్చి ఆదిత్యోపాసన చేస్తున్నారు.

జ : ఆదిత్యుడు మన కులదైవము కూడా కాదూ? నీవు మాట తప్పకూడదు సుమా! మన మా ప్రత్యక్షదైవాన్ని, ఆ జగత్సాక్షిని, సూర్యమండలానికే ఎగిరి పోయి, గర్భాలయంలో ద్విజోత్తములవలె ఉండి

ఉపాసన చేశా మివ్వాళ! లే, అన్నా !

సం : [నిర్ఘాంతపోయి మాట్లాడడు.]

జ : మాట్లాడవేమన్నా? ఇప్పటికి ఎంతకాలంనుంచో ఆ పతంగరత్నాన్ని స్పృశించి రావలెనని కోరికగా ఉంది!

సం : [మౌనము]

జ : మన కగపడే సమస్త జ్యోతులకూ కారణభూతమైన ఆసూర్యజ్యోతిని ఒక్కసారి సమీపించి, దర్శించి గాఢాలింగనము చేసి ఈజన్మ సార్థకము చేసుకోవలెనని ఉంటుంది –– అన్నా ! మాట్లాడవేం ?

సం : [మౌనము]

జ : ఒక్కొక్కసారి బంగారపు ముద్దలాగానూ, ఇంకొక్కప్పుడు రక్తపు విగ్రహంవలెనూ, మరొకవేళ, శుద్ధ-జ్యోతిః స్వరూపంగానూ, ఇంకా ఎన్నో రకరకాలుగా ఆ జగజ్జ్యోతి కనపడుతుంటాడు. ఏ చిత్రకారుడి రంగుల సంచిలోనూ దొరకని రంగులతో, ఏ శిల్పీ ఊహించ

లేని చిత్రి చిత్రమైన ప్రాసాదాలు విగ్రహాలూ, చిత్రాలూ, ఆకాశరంగంమీద ఉదయాస్తమయాలలో క్షణానికి ఒక క్రొత్తవిధంగా కల్పిస్తూ ఉంటాడు ఈ మహాశిల్పి. ఈ చిత్రి ఖగరత్నమే నా మనస్సును రాత్రింబవళ్ళూ ఆకర్షిస్తూ ఉన్నది.

సం : [అంత కంతకు ఎక్కువ ఆశ్చర్యముతో మౌనము.]

శ : అట్లా బెదురు చూపులు చూస్తూ మాట్లాడ వేమిటి అన్నా? ఈ మధ్యమలోకవాసులకు ఆదిత్యమండలము దృష్టికి అవధిగా ఉండి ఆ మండలము అవతల ఏమేమి అద్భుతమైన లోకాలు ఉన్నవో కనపడకుండా అడ్డు తగులుతున్నది. అన్నయ్యా! మన దూరదృష్టికి ఈ ఆటంకము భరించలేకున్నాను నేను. ఆ పైలోకాల స్వరూపము తెలుసుకోవలెనని ఉంటుంది నాకు. నేను కూచున్నా నిలుచున్నా పడుకున్నా ఎగురుతున్నా, నాకు అదే ఊహ ఎల్లప్పుడూ! నయానో భయానో ఆదిత్య మండలము భేదించుకొని పోవలె ననే

నా కెప్పుడూ!

సం : [మాటలు వారిస్తున్న నాసవలె] ఆఁ! - ఆఁ!—

జ : ఏం? ఆదిత్యమండలము భేదించడము అసాధ్యమా అన్నా? మునీశ్వరులంతా ఆ మార్గంగానే పై లోకాలకు వెళుతారని చెబుతారు కదూ!

సం : [జాలితో] సర్వసంగ పరిత్యాగము చేసిన ఆ ద్విజ వృషభులకూ, కేవల ద్విజనామధారుల మైన మనకూ సాపత్యమా, తమ్ముడూ? వాళ్లుమాత్రము ఈ పాంచ భౌతిక దేహాలతో ఆ మార్గాన పో గలరా?

జ : ఒకరికి సాధ్య మైనది మనకు మాత్రము ఎందుకు సాధ్యము కాదు? నీ భయమేమిటి, వెళితే ఏ మవు తుందనీ?

సం : అసలు అక్కడికి వెళ్ళగలుగుతే గదా!

జ : ఈ దేహాలతో అక్కడికి వెళ్ళడము ఎవరికీ చేతే కాదంటావా? అయితే మన తాతపాదులు సూర్యరథ

సారథ్యము చేయడంలేదా?

సం : అవును కాని మనకూ వారికీ పోలికా?

జ : అన్నా, వారు సంపూర్ణ పరిణతి లేకుండా జన్మించిన అనూరులు కదా! పురాణ పురుషులు కదా! పరిపుష్టి కలిగి వారికి జన్మించి ఇట్లా యౌవన మదంలో ఉన్న మనకు, వారితో సమాన మైన శక్తి ఐనా లేదంటావా?

సం : [వెకిలినవ్వుతో] నిన్ను చూస్తే నాకు నవ్వు వస్తున్న దోయి. మన తాతపాదుల మహిమాతిశయము సంగతి, మన అమ్మగారు శ్యేనీదేవి నాకు చిన్నప్పుడు చెబుతూ ఉండేది. నేనూ నా యౌవనోద్రేకములో ఇట్లాగే తండ్రిగారి దర్శనానికి వెళ్ళవలెనంటే, అమ్మ గారు ఒకరోజు బాగా కోపపడ్డది. మన తాతపాదుల కాలి కొనగోటికి కూడా మనము పోల జాల మని చెప్పింది. అప్పటినుంచీ మాతృశాసనము శిరసా

వహించి నేను మళ్లీ పతంగలోక యానము తల పెట్టలేదు.

జ : తల్లులకు తమ పిల్లలెప్పుడూ పసివాళ్ళుగానూ దుర్బలులుగానూ కనబడుతూ ఉంటారు. మాతృ ప్రేమకు అది సహజము. మన కనిష్ఠపితృవ్యులు కూడా సూర్యలోకము దాటి అన్ని లోకాలూ సంచరిస్తారని వింటానే!

సం : అవును. అయితే?

జ : అన్నా, మన పితృవ్యులు శత్రువుల దాస్యంచేస్తూ చాలాకాలం గడిపి చిన్నతన మంతా సరిగా నిద్రాహారాలు లేక జాలిగా పెరిగినవారే! స్వేచ్ఛావృత్తిలో పుట్టి పెరిగి నిరంకుశంగా చరిస్తూ జీవిస్తున్న మనకు వారికున్న శక్తి లేదంటావా?

సం : [పకపకా నవ్వుతాడు]

జ : [చిన్నపుచ్చుకుని] అట్లా నవ్వుతావు, ఏమన్నాననూ?

సం : గరుత్మానులను దర్శించే భాగ్యము నా కొకసారి అబ్బిందోయి. వారి రూపూ తేజస్సూ శక్తీ అతిలోక మయింది. వారిని చూసిన వాళ్ళు మనలను వారితో పోల్చుకుంటే, ఇట్లాగే పకపకా నవ్వుతారు. హస్తిమశకాంతరము వారికీ మనకూ.

జ : ఆత్మశక్తి ఎరగని హనుమానుడ వన్నా, నీవు. పోనీ గాని వానర మాత్రుడైన ఆ హనుమంతుడు సూర్య లోకానికి వెళ్ళలా? ఆయనకు రెక్కలైనా లేవే?

సం : పోను పోను ఎక్కువవాళ్లే నీకు పోలికకు కనబడుతున్నారే. ఆ మహాత్ముణ్ణి మహా దేవావతారుణ్ణి వానర మాత్రు డన్నావా? ఆ హరి మర్కటమూర్తి పూర్వాపరాద్రులు రెంటిలో రెండు పాదాలూ ఉంచి జగత్సాక్షి వద్ద సర్వవిద్యలూ నేర్చినాడు. పోనీ, నీవు అట్లా నిలబడూ, చూతాము.

జ : నీవు ప్రతిదానికీ ఇట్లాగే అంటావు.

సం : [కఠినంగా] ఎంత ఉత్సాహమైనా ఉండవచ్చును గాని స్వస్వరూప జ్ఞానము మాత్రము ఉండవలె !

జ : [పశ్చాత్తాపముతో] పెద్దలను ధిక్కరించవలె నని మాట్లాడలేదు, నేను; ఈ దేహముతో సూర్యలోక యానము కష్టసాధ్యమే కాని అసాధ్యము కాదని అన డానికి అన్నానుగాని!

సం : [ప్రసన్నుడై ] పోనీలే! గంధర్వులు తీక్ష్ణకాములు. భుజంగములకు కోపము తీక్ష్ణము. మృగాలకు భయము తీక్ష్ణమైనది. అన్నిటికంటే తీక్ష్ణమైన క్షుధగలవాళ్లము మనము. సుఖంగా కుడిచి కూచోలేక, ఎందుకు నాయనా మన కీప్రయత్నము ?

జ : ఏ దెట్లా ఉన్నా ఒక్క సంగతి చెబుతా విను. మనము ప్రకృతి సిద్ధంగా ఆకాశచారులము. చివరకు ఆ ప్రయత్నములో మనకు నిధనమే కలిగినా, పతంగ యాత్రము చేసి తీరవలసిందే.

సం : అగ్నిశిఖను మింగవలె ననే ఆశతో పరుగులెత్తే పతంగాల గతే మనకూ పట్టుతుందేమో అని నా సంశయము.

జ : అట్లా ఐనా నాకు సమ్మతమే, మనకంతా తెలిసిన ఈ భూలోకంలో, చూసిందే చూస్తూ తిరిగేకంటె!

సం : నీ కోరిక మార్చుకోలేవూ?

జ : అన్నా, చూడు, ఆ సూర్యకిరణాలు ఎన్నెన్ని రంగులతో మనమీద ప్రసరిస్తున్నవో! ఆ సహస్రకరుడు ప్రతికిరణంతోనూ నన్ను 'రా, రా' అని పిలుస్తున్నట్లుగా నాకు కనిపిస్తున్నది. ఇనుమును అయస్కాంతమల్లే నన్నా భగవానుడు ఆకర్షిస్తున్నాడు. పోనీగానీ ఒక పని చేస్తే?

సం : ఏమిటది?

జ : నీకు కూడా అక్కడికి రావలెనని ఉత్సాహం లేకపోతే, నన్ను ఒక్కణ్ణే వెళ్ళడానికి అనుజ్ఞ ఇయ్యి.

సూర్యమండలం చూసివస్తాను.

సం : [ఆవరముతో] నీవు వెళ్ళుతూఉంటే దేహాభిమానంతో వెనక ఉండే భీరువు ననుకున్నావా నేను? నాభయమంతా నీ యందలి వాత్సల్యాతిశయంవల్ల గాని నాకోసం గాదు.

జ : [ బతిమాలుతూ ]అయితే వెళుదాము, లే!

సం : తప్పదా?

జ : ఊఁహూఁ!

సం : [లేచి] అయితే గాయిత్రిని ధ్యానము చేతాము!

ఇద్దరూ కొంతసేపు ధ్యానము చేస్తారు. ఇంతలో తెరలో మునీశ్వరులు చేస్తున్న సూర్యోపస్థాన మంత్రం వినవస్తుంది.

మిత్రస్య చర్షణీధృతః శ్రవోదేవస్య సానసిం సత్యం చిత్రశ్రవస్తమమ్। మిత్రో జనాన్యాతయతి ప్రజానన్ మిత్రోదాధార పృథివీముతద్యాం మిత్రః కృష్టీ రనిమిషాభిచష్టే సత్యాయ హవ్యం ఘృతవ ద్విధేమ। ప్ర స మిత్ర మర్తోస్తు ప్రయస్వాన్యస్త ఆదిత్య

పతంగయాత్ర



శక్షతి వ్రతేన న హన్యతే న జీయత్యే ...
త్యంతితో న దూరాత్ ॥

ఉభయులూ—సంపాతి సావధానముగానూ జటాయువు తొందరతోనూ—ఆలకిస్తారు.

జ : ఆశ్రమస్థులంతా సూర్యోపస్థానము చెబుతున్నారు. మనము కూడా సూర్యమండలోపస్థానము చేయడానికి మంచి సమయ మిదే, బయలుదేరుదామా?

సం : [రెక్కలు అప్పళిస్తూ బిగ్గరగా] ఊఁ !

జ : [రోమాంచముతో] అన్నా, కార్యక్రమానికి ఉపక్రమిస్తే ఎంత ప్రతిభాశాలి వోయి. నీ రెక్కల చప్పుడుకు గిరగహ్వారా లన్నీ విజయ భేరీధ్వని వలె ఎట్లా ప్రతిధ్వనిస్తున్న వో వినూ ! ఈ పర్వతారణ్యాసత్త్వా లన్నీ భయపడి చెల్లాచెద రవుతున్నవి.

సం : [వీరావేశముతో] మనలో సూర్యమండల ప్రస్థానముచేసి ఎవరు ముందర తిరిగి వస్తారో, పందెమేనా?

జ : పందెమే,

సం : నీవు గెలిస్తే నీకొక ముద్దు!

జ : నీవు గెలిస్తే నీకొక సాష్టాంగ నమస్కారము!

సం : [చిరునవ్వుతో] కరువులేని పందెములే.

జ : మనము మళ్లీ సూర్యాస్తమయం లోగా ఇక్కడికి తిరిగి రావలె.

సం : [ఉద్రేకముతో ఎగురుతూ] కూ ఊ ఊ ఊ ఊఁ!

జ : నీవు 'కూఁ' అంటే ఎంత శ్రావ్యంగానూ మేఘఘోష వలె ఏమి గంభీరంగానూ ఉన్నది అన్నా! నాకు రోమ హర్షం కలుగుతున్నది. కూ ఊ ఊ ఊ ఊ ఊఁ!

జటాయువు కూడా పైకెగురుతాడు.

తెరలో మునీశ్వరులు.

ఇంత ఆర్భాటంగా ఎక్కడికర్రా వెళ్ళుతున్నారు?

సం : [స్వగతము] ఏమిటీ అపశకునము!

జ : మే మిద్దరమూ పందెము వేసుకొని సూర్య మండ లానికి వెళ్ళుతున్నాము. అస్తమయానికి తిరిగి రావలె. మీరే మా పందెముకు సాక్షులు.

తెరలో మునీశ్వరులు

ఒకరు : ఎంత సాహసమోయి!

ఇంకొకరు : వాళ్ళ కసాధ్య మేముంది!

మరిఒకరు : ఎంతవాళ్ళయితే మాత్రము సూర్యలోక యాత్ర చేయగలరా?

చాలామంది : [ఆశ్చర్యంతో] ఆఁ! ఆఁ! ఆఁ! ఆఁ?

సం : [స్వగతము] మళ్లీ అపశకునపు మాటలే వినబడు తున్నవే! [ప్రకాశముగా] తమ్ముడూ!—

జ : అన్నా, ఈ మేఘాలు చూడు, కిందినుంచి చూస్తే రశ్మిమాలినికూడా కనపడకుండా దట్టంగా కప్పివేసి మరుగు పరుస్తవి. ఇక్కడికి వస్తే ఏమీలేదు. వట్టి పొగే! ఇట్లాగే సూర్యుడుకూడా ఐతే?

సం : తమ్ముడూ! ఒక్కసారి భక్తితో గురుదేవులైన తాతపాదులను నీవుకూడా స్మరించుకోవోయి! [ఒక్కసారి సూర్యమండలము వేపు దృష్టి సారించి] తండ్రీ అరుణభగవన్, నీ సన్నిధికి వస్తున్నాము. రక్షించు స్వామీ! [మళ్ళీ మెడ కిందికి వంచుతాడు.]

జ : [పైకి చూస్తూ] తండ్రీ, నమస్కారము!

సం ; [కిందికి చూస్తూ] మనము వదలివచ్చిన కైలాసపర్వతము చుట్టు చుట్టుకొని ముడుచుకున్న తెల్లతాచు వలె సూర్యకాంతిలో ఎట్లా మెరుస్తూ ఉన్నదో చూచావా?

జ : [పైకి చూస్తూ] భూమిని విడిచి పైకి వచ్చిన కొద్దీ, అంతకంతకు భూ కల్మషపు భారము తగ్గి, ఇక్కడ వాయువు ఎంత తేలికై నిర్మలంగా ఉన్నదో చూడూ!

సం : [కిందచూస్తూ] భూలోకంలో పెద్ద పెద్ద పట్టణాలన్నీ రథచక్రాలవలె ఉన్నవి. కొండలన్నీ గులకరాళ్ళల్లేనూ,

వాటిమధ్య పాకులాడే పాములవలె నదులున్నా కన
బడు తున్నవి.

జ : [పైకి చూస్తూ] దూరము వచ్చినకొద్దీ మన వేగము
ఎక్కువ కావడం లేదా? సంకెళ్ళు తీసిన బందీకివలె
లేదూ, మన కిప్పుడు?

సం : [కిందికి చూస్తూ] ఇప్పుడు భూలోకంలో నదులన్నీ
లోకాన్ని పైకి ఎగిరి రాకుండా బంధించిన సూత్రాల
లాగా కనపడడం లేదా! హిమవంతమూ వింధ్యమూ
మేరువూ మాత్రము కొండ చిలువలల్లే ఉన్నవి.

జ : [పైకి చూస్తూ—మెడ నిక్కించి సంపాతిని మించి
పోవలెనని ప్రయత్నిస్తాడు, కాని మించి పోలేడు.]
నీ జవ సత్త్వాలు ఎంత అద్భుతమైన వన్నా ! నా ఒంట్లో
ఉన్న శక్తి అంతా ప్రయోగించి, నిన్ను మించి పోవలె
నని యత్నించినా, నీవు సునాయాసంగా ఎగురు
తున్నట్లే ఉండికూడా, నిన్ను దాటి ఒక్క అడుగైనా
పైకి పోనీయవే!

సం : [క్రిందికి చూస్తూ] ఈ అద్భుత చిత్రము చూడూ! భూలోకంలో మహా సముద్రాలన్నీ ఒక తామర కొలనుగానూ, అందులో నడిబొడ్డులో భరతవర్షము వికసించిన తెల్లని సహస్రదళ కమలంలాగానూ, హిమవంతాదులైన ఉన్నత పర్వతాలన్నీ దాని కేసరాలు గానూ కనబడు తున్నవి. కాశీపట్టణము అందులో కర్ణికవలె ఉన్నది. ఎంత పవిత్ర దృశ్యమోయ్యా, ఇది!

జ : [సంపాతివేపు చూస్తూ] అన్నా, నీ ఎర్రటి రెక్కల మీద సూర్యకాంతి ప్రతిఫలిస్తూ ఉంటే సహస్ర సూర్యులను భరిస్తున్న అరుణాచలంవలే సాక్షాత్తూ అగపడుతున్నావు గదోయి!

సం : [జటాయువువేపు చూస్తూ] నీవో, సాక్షాత్తు మేరువువలె మెరుస్తున్నావు. [భూమివైపు చూస్తూ] కాని అటుచూడూ! ఇప్పుడు భూమండలము, నక్షత్ర మండలంతో కలిసిపోయి, అదికూడా ఒక

చుక్కలాగానే ఐపోయి,—అదుగో, అంతర్ధాన మవుతున్నది.

జ : [పైకి చూస్తూ] ఇప్పటికి నా హృదయ తాపము కాస్త శాంతించే విధంగా ఉన్నది. భూలోక కశ్మలము వదిలింది. [ఉత్సాహంగా] కూ ఊ ఊః!

సం : [ఉత్సాహంగా] కూ ఊ ఊః!

జ : [పైకి చూస్తూ] ఈ చిత్రం చూచావా? మన కూతలు, ప్రతిధ్వనులు ఏమీ లేకుండా, సూటిగా హరిహరుల రెండు ధనస్సులలోనుంచి ఒకేసారిగా విడిచిన బాణాలవలె ముందుకు పరుగెత్తు తున్నవి!

సం : [తల వంచుకొని] ఇప్పు డేమయినా దిక్కు తెలుస్తున్నదా తమ్ముడూ? తూర్పేదో పడమరేదో చెప్పూ, చూదాము.

జ : [మెడ ఎత్తుకొని] మనము ఇప్పు డాసూర్యమండలానికి వెళుతున్నాము. అదే తూర్పు. నాకు ఇంకో దిక్కు

అక్కర లేదు.

సం : [మెడ వంచుకొని] పోనీ, ఇప్పుడు పైనసరే, కింద ఏదో చెప్పగలవేమో చూడూ!

జ : [ఎగు మెడతో] అన్నా, నాకు పైన అరుణమండలము మండుతూ కనబడుతున్నది. కిందుతో నాకేమి పని!

సం : [కింది మెడతో] సరే, కాని,— ఇప్పుడు ఏవేళ అయిందో ఊహించ గలవ్రా? పోనీ, ఇది రాత్రో పగలో చెప్పూ చూస్తాను!

జ : [ఎగు మెడతో] పతంగ యాత్రికులకు ఎప్పుడూ పగలే కాని రాత్రి ఏముంటుంది!— మహాగ్ని హోత్రమువలె సూర్యభగవానుడు కదలిక లేకుండా ఒక్కచోటనే ఉన్నాడు.

సం : ఎక్కువగా సూర్యమండలము వంక తదేక దృష్టితో చూడబోకు నాయనా! కళ్లు మిఱుమిట్లు కొంట వేమో!

జ : [మెడ పైకెత్తి చూస్తూ] సరేకాని ఈఅద్భుతం చూడు, మొదట గుమ్మడి పండంత ఉన్న ఈ రశ్మి మాలి, క్రమేణా పెద్ద పెద్దవాడై ఇప్పుడు భూమండల మంత అగ్నిగోళముగా కనపిస్తున్నాడు.

సం : వేగము కొంచెము తగ్గించి ఇక మనము మెల్లుకువగా పోవాలి!

జ : ఊపిరి సలపడం లేదు, ఏమి హాయిగా ఉన్నది! భూలోకపు బరువు పూర్తిగా వదిలి పోయింది.

సం : మనమిప్పుడు లౌకిక వాయుమార్గము దాటి పోతున్నాము.

జ : [పై చూపు చూస్తూనే] అందుకనే కాబోలు, విపరీతమైన ఈ చెమట. స్నానం చేసినట్లు శరీరమంతా ముంచెత్తు తున్నది.

సం : మన యాత్రలో కష్టపుపాలు ప్రారంభించింది.

జ : ఏమి వేడి అన్నా! ఇప్పటికి నా హృదయంలో వేడిక

దీటుగా ఈ వివస్వానుని వేడి తగిలి సమత్వం కలిగిస్తున్నది. ఇప్పుడు నా యాత్రేచ్ఛ సఫలమయింది.

సం : నా మాట విని ఇంకా కొంచెము వేగము తగ్గించు!

జ : ఇక్కడే ఇంత హాయిగా ఉంటే, ఇంకా దగ్గరకు పోతే ఎంత బాగుంటుందో! అవును గాని, కొంచెము దాహ మనిపించడము లేదా నీకు?

సం : నిజమే. కొంచెము నిలిచి సేద తీర్చుకో!

జ : [ఆగకుండా] దారి పొడుగునా ఇట్లా అలుపు తీర్చుకుంటూ కూచుంటే మనము సూర్య లోకము ఎప్పటికి చేరుకుంటాము! — కాని గొంతు తడి ఆరి పోతున్నదే! ఏ మబ్బా ఇది! సూర్య మండలము ఇంకా రాదేం?

సం : నీవు ఊరికే తొందరపడకు. సూర్యమండలము ఇంకా చాలా దూరమున్నది. గోళము పెద్దది పెద్దది అవుతున్నది కాని ఏమాత్రమూ దగ్గరకు వస్తున్నట్లే తోచడం లేదు. ఎన్ని వేల యోజనాలు వచ్చామో,

ఇంకా ఎన్ని వెళ్ళవలెనో తెలియకుండా ఉన్నది. మనము బయలుదేరి ఎన్నాళ్ళయిందో కూడా తెలియడం లేదు.

జ : [సూర్యమండలం వేపు చూడలేక తప్పనిసరిగా మెడ దింపి] పతంగ మండల మిప్పుడు భయంకరముగా మండుతున్న ప్రళయాగ్ని హోత్రము వలె ఉన్నది. కిరణాలేవీ లేవు. వాటికి బదులు అగ్నిశిఖలే శేషాహి నాలుకలవలె వెళ్ళుకుని వచ్చి దహించి వేస్తున్నవి. కళ్ళు పైకెత్తి చూడ లేకుండా ఉన్నాను. అన్నా! ఎట్లా ఈ ఆశ్చర్యావహమైన ఆదిత్యలోకంలో వింతలు చూసేది! — అన్నా! ఏమిది! దేహమంతా విరవిర లాడి పోతున్నదే! చర్మము మంట లెత్తుతున్నదే!

పం : [గాభరాతో] తమ్ముడూ, అట్లా నల్లపడ్డావేమోయి, నీ వంటినిండా పొగ కమ్ముకున్నదేమోయి, నాయనా!

జ : ఏమిటాత్రే దన్నా! ఈ పనికి పూలిన నా చిరుకుక
లున్నవే,_ఇవే,— సూర్యాగ్ని శిఖలకు కాలిపోతు
న్నవి. దూరిశింపజాలనంటివి మన రెందు కవి? అనవసర
మైన దేహవాసనలను ఈ విధంగానే జ్ఞానాగ్ని దహి
స్తుంది కాబోలు! ఇప్పుడు మనకు తగులుతున్న వేడి
వంటికి చలి నీకు చంద్రమండలంలో వేసిందా అన్నా?

సం : ఆఁ! సరిగా పోల్చావోయి రెండూను.

జ : ఎంత మహాద్భుతము! కళ్ళప్పమాత్రం కనిపించడం
లేదు. పాతాళ గహ్వరంలో చీకటి అంతా ఒక్క
పెట్టున ఈ సూర్యభగవానుడి దగ్గిరికి ఎట్లా వచ్చిందీ!
దీన్ని చీలుస్తాను!

జటాయువు ముక్కుతో ఆకాశం చీలుస్తూ కాస్త కింద పడు
తున్నాడు.

సం : [తనకంటే కింద జటాయువు కనపడగా గాభరాగా]
ఆఁ! ఆఁ! కిందికి పోతున్నావేం?

జ : [ప్రయత్నపూర్వకంగా సంపాతితో కలుసుకొని] ఇట్లా రెక్కలు తెంపుతూ స్తంభించినవేమి! నా కేమీ కనపడడం లేదు.

సం : [దీనంగా] ఎక్కడున్నావో నీవు, బాగా కనపడడం లేదోయి, తమ్ముడూ!

జ : [పడుతూ లేస్తూ దిక్కు తెలియక పక్కలకు పోతూ ఆర్తస్వరముతో] అన్నా! — అన్నా! — ఎటు పోతున్నాను? — నా కేమీ కనపడడం లేదు! — సూర్యభగవాను డేడీ? ఏమిటీ అమావాస్య చీకటి! — మన ప్రయత్నము చాలించ గూడదు, ఏమైనా సరే! పతంగ స్వామీ, చేదుకో!

సంపాతి అమిత ప్రయత్నంతో కళ్ళెత్తి చూస్తాడు. జటాయువు చిరు రెక్కలు కాలుతూ నీరసంగా పడిపోతూ ఉంటాడు. మళ్ళీ ఇంకొక ప్రయత్నము ఎట్లాగో చేసి జటాయువుమీదికి ఎగిరి సూర్యుని మంటలు జటాయువుకు తగలకుండా తన రెక్కలు అడ్డు పెడతాడు.

సం : తమ్ముడూ, భయంలేదు!

జ : వెనకటి వలెనే పడుతూ లేస్తూ స్మృతి ఉండీ లేక] అన్నా, ఇంత అయోమయంగా ఉన్న దేమిటి?—నీవు క్షేమమేనా అన్నా ?

సం : తమ్ముడూ, క్షేమమే గాని నీ బాధ తగ్గిందా ?

జ : చెవులు గడిసెలుపడి ఏమీ వినపడడం లేదు. అన్నా! నీవు క్షేమంగా ఉన్నట్లు తెలియడానికిబిగ్గరగా అరూ!

సం : [ప్రయత్నపూర్వకంగా బిగ్గరగా] కూ ఊ ఊం!

జ : [రెక్కల మంట చల్లారిందికాని కింద పడిపోతున్నాడు. అన్న కూజితము విన్న తృప్తితో గద్గదంగా] అమ్మా! — కూ ఊ ఊం!

సం : [ముందు చిన్న ఈకలూ క్రమేణా చిరు రెక్కలూ చివరకు పెద్ద రెక్కలూ అన్నీ కాలిపోతూ ఉన్నా, అగ్ని పర్వతమువలె నిశ్చలంగా ఒక నిముషముంటాడు] తమ్ముడూ, క్షేమమా! కూ ఊ ఊం!

జ : [పడిపోతూ] సంపాతి అన్నా నమస్కారము!

సం : [దూరదూరంగా పడిపోతూ] జటాయూ, చిరంజీవ!

జ : [దూరంగా పడిపోతూ] సంపాతీ! –

సం : [దూరంగా పడిపోతూ] జటాయూ! –

జ : [అల్లాగే పడిపోతూ] అన్నా! –

సం : [అల్లాగే] తమ్ముడూ! –

జ : [దూరంగా పడిపోతూ స్మృతి పోతున్నకొద్దీ కునికి పడుతున్న . స్వరంతో] కూ ఊ ఊ ఊ ఊ ఊ ఊఁ!

కూత గాలిలో కలిసి అణిగి పోతుంది.

సం : [రెక్క లేమీ లేని మొండెమునిండా కాలిన గాయా లతో దూరంగా పడిపోతూ స్మృతి పోతున్నకొద్దీ పడి పోతున్న మూలుగు శబ్దంతో] కూ ఊ ఊ ఊ ఊ ఊ ఊ . !

కూత అంతకంతకు తగ్గి తగ్గి గాలిలో కలిసి అణిగి పోతుంది. – నిశ్శబ్దము. జటాయువూ సంపాతీ దూర దూరంగా పడిపోతూ ఉంటారు.

[తెర]

# స్వయంవరము

అంకితం

శ్రీ గోరా శంకరరావుకు

# స్వయంవరము

## పాత్రలు

డాక్టరు నాయుడుగారు

డాక్టరు భార్య

ప్రభ:—డాక్టరుకుమార్తె

ప్రకాశరావు:—వారి మేనల్లుడు

గన్నారావు, చింతయ్య:— ప్రభ సహాధ్యాయులు

శాస్త్రి:— డాక్టరు కుటుంబమిత్రుడు

డాక్టరు స్నేహితులతో మాట్లాడుకునే హాలు. కుడిపక్కన డాక్టరు రోగులతో మాట్లాడే గది. ఎడమపక్కన ప్రభ చదువుకునే గది. రెండు పక్కగదులలోకీ హాలులోనుంచి వాకిళ్ళు ఉన్నవి. అవి దగ్గరగా వేసి ఉంటవి. అప్పుడప్పుడు పక్కగదులలో బిగ్గరగా మాట్లాడే మాటలు హాలులోకి వినిపిస్తూ ఉంటవి హాలులో ఒక టేబిలూ, కొన్ని కుర్చీలూ ఉంటవి.

హాలు వెనకగోడకు మధ్యలో వాకిలి, పక్కల రెండు కిటికీలు. గోడ అవతల వరండా. తెర ఎత్తేప్పటికి హాలులో డాక్టరుభార్య ముందర ఒక బొమ్మల పత్రిక వేసుకుని కూచుంటుంది. ఆమె పత్రిక పేజీలు తిరగవేస్తున్నా వాటివేపు చూడక మాటిమాటికీ ఆదుర్దాగా ప్రక్క చదువుకునే గదివాకిలివేపు చూస్తూఉంటుంది. ఆవాకిలి తెరుచుకొని శాంతముగా శాస్త్రి ప్రవేశిస్తాడు.

డాక్టరుభార్య : [ఆదుర్దాగా] ఒప్పుకున్నదా?

శాస్త్రి : ఆఁ, ఒప్పుకున్నట్టే.

డా. భా : [నిట్టూర్పుతో] నాకు సగము బరువు తీరినది. మరి వారికీ సంగతులే పట్టదు. —చాలాసేపు మాట్లాడినారే!

శా : ఈ కాలపు పిల్లలు వెంటనే చెప్పినమాట వింటారా?

డా. భా : అందులో మా ప్రభ మరీ పెంకెదండి.

శా : తండ్రిపోలికే.

డా. భా : [నవ్వుతూ] మూడురోజులబట్టీ మా ప్రభా, ప్రకాశం ఎందుకో ఒకటే పోట్లాడుకుంటున్నారు.

శా : పిల్లల పోట్లాటల కేంగాని గఫూర్ అంటే ఎవరండీ?

డా. భా : ఆఁ, అతను మా అమ్మాయిసహాధ్యాయి. బహు బుద్ధిమంతుడు. ఎప్పుడన్నా మన యింటికి వస్తూ పోతూ వుంటాడు.

శా : వాడు ప్రభను తనను పెళ్లి చేసుకోమని అడిగి నాడట తెలుసునా?

డా. భా : ఆఁ !. ఎంతమాట! వాడి కంతపొగరా—నాకు తెలియనే లేదే !

శా : మీ అమ్మాయి అందుకు ఒప్పుకున్నది.

డా. భా : [నివ్వెరపోయి క్షణము మాట్లాడదు. తర్వాత తెప్పరిల్లుకొని] అయ్యో! ఆ తురకనే!

శా : చింతయ్యట ఎవడండీ?

డా. భా : వాడూ అట్లాంటి అష్టదరిద్రుడే. ప్రభతో చదువు కోడానికి వస్తూఉంటాడు.

శా : ఖైన్నారా?

డా. భా : ఆ మాదిగకూడా ప్రభను పెళ్ళిచేసు కోమన్నాడా?

శా : మీ అమ్మాయి అంగీకరించిందికూడానూ!

డా. భా : ఇంతకూ మాకర్మం. వారు ఎంత చెప్పినా వినరు. ఎదిగిన అమ్మాయితో మాట్లాడటానికి వీళ్ళింత్లా వస్తూ పోతూ ఉండడం నా కిష్టంలేదు. అదంతా తెల్ల వాళ్ళకే సరిపోయింది.

శా : అట్లా అనకండి! ఒక్కగాక ఒక్కకూతురు గనుక, పాపం డాక్టరుకు, అమ్మాయికి నచ్చినవాడికే ఇచ్చి పెళ్ళిచేయువలె నని కోరిక. అది న్యాయమే!

డా. భా : మా ప్రకాశంకంటే నచ్చేవాళ్లు ఎవ రుం టారకడీ!

శ్రా : దానికేం లెండి!

డా. భా : అయితే మీరేం జేశారు? ఏమని ఒప్పించారు?

శా : ఏముందీ!—ఆ తురకను మాదిగను చేసుకోను

అనిపించేటప్పటికి నా తల ప్రాణం తోకకు వచ్చింది. మాట తప్పు వల్ల కాదంటుంది.

డా. భా : అయితే ఆయిద్దరినీ చేసుకుంటుందా?

శా : నేను మాత్రము అమ్మాయిని అబద్ధమాడమంటానా? ఇక ప్రకాశం పేరు ఎత్తుతేనే మండిపోతున్నది.

డా. భా : అయితే మరి ఎట్లా సాధించారు?

శా : ఎంత పూర్వపు కాలపువారండీ మీరు! వట్టి అమాయికపు వారమ్మా! ప్రకాశరావును మీ అమ్మాయి చేసు కుంటుందనా? అయినా మీ రే అడిగి చూడండి!

డా. భా : అయితే?

శా : ప్రకాశం లాభం లేదమ్మా—పోనీగదా, నన్ను మీ రింత ఆదరంతో పిలిపించినారని, బాగా ఆలోచించి, మనస్సు ఎట్లాగో సరిపెట్టుకొని, ఈ చిక్కు తీర్చడానికని నేనే చేసుకుంటానంటే సరేనని కాగితం వ్రాసి యిచ్చింది. ఇక నాకు డాక్టరుతో స్నేహమే

కాక బంధుత్వంకూడా కలుస్తుంది. శాస్త్రముకూడా ఒప్పుకుంటుంది లెండి. స్త్రీరత్నం......

డా. భా : [ముందు నిర్ఘాంతపోయి తర్వాత కోపంగా] ఇదా మీరు చేసింది, మాకొంప ముంచారే! మీకు అనడానికి నో రెట్లావచ్చిందండీ?

శా : వాళ్లిద్దరిని చేసుకోడానికి ఒప్పుకున్నది న న్నెందుకు చేసుకోదని అడిగాను. ఒప్పుకున్నది. చేసుకునే పిల్ల ఉంటే పెళ్లి ఎవరి కక్కరలేదు?

డా. భా : మీకు నలభైఏళ్లు దాటినవే, మా అమ్మాయి ఈడుపిల్ల లున్నారే. మీరు మాకుటుంబానికి చిరకాలమునుంచి స్నేహితులుగదా అని నేను మిమ్మును పిలిపిస్తే ఇంతపని చేస్తారా! ఎంత మోసముచేశారు!

శా : నేను మోసము చేయడమే ఎరగను. మీ అమ్మాయి మనస్ఫూర్తిగా ఒప్పుకొని కాగితంకూడా వ్రాసి ఇచ్చింది.

డా. భా : ఇదికాకపోతే మోసమంటే ఏమిటి?

శా : ఇదేమిటమ్మా, మీరు సంతోషిస్తా రనుకుంటే, ఇట్లా అనవసరంగా కోపపడతారు! అనుమాన ముంటే మీ అమ్మాయి వ్రాసి ఇచ్చిన ఈ కాగితం చూడండి. [జేబులో నుంచి కాగితము తీస్తాడు.]

డా. భా : ఈ పని మీ బ్రాహ్మలకే చెల్లిపోయింది. మే మింత తెలివి తక్కువవాళ్ళం కాబట్టే మమ్మల్ని ఇట్లా తిప్పలు పెడుతూ ఉంటారు. [అంటూ రివ్వున వెనక వరాండాలోకి వెళ్ళిపోతుంది.]

శాస్త్రి చిరునవ్వు నవ్వుతూ ఆవలిస్తూ చిటికెలు వేస్తూ వింటూ ఉంటాడు.

కుడిపక్క గదిలోనుంచి డాక్టరు గొంతు.

ఏం గఫూర్, ప్రభ ఇంట్లో లేదూ?

గఫూర్ గొంతు

కాదు సార్—కాస్త మీతో—మాట్లాడాల్సి ఉంది.

డాక్టరు గొంతు

ఏం? ఒంట్లో కులాసాగా లేదా?

గఫూర్ గొంతు

కాదు. కాస్త ప్రైవేటుమాట సార్!

డాక్టరు గొంతు

అయితే పక్కహాల్లో కూర్చో. ఇక్కడ పని తొందర తగ్గగానే వస్తాను. అక్కడ మా శాస్త్రిగారున్నారు!— కంపౌండర్! ఇతనికి మందు కావాలిటగాని డైఫ్లొరైడ్ మిక్స్చరు ఇచ్చి పంపించు!

గఫూర్ బెదురు చూపులతో కుడిపక్క వాకిట్లోనుంచి ప్రవేశము.

గఫూర్ : ఆదాబ్ హాజరత్!

శా : దీర్ఘాయు రస్తు! గఫూరంటే——?

గ ; నేనే సార్!

శా : ప్రభా, నీవూ ఒకక్లాసేనా?

గ : అవునండీ సార్.

ఎడమపక్క ప్రభ చదువుకొనే గదిలోనుంచి ప్రభా, ప్రకాశరావూ పోట్లాడుకొనే కేకలు.

ప్రకాశరావు గొంతు

నీకేమైనా సెన్సు ఉందీ?

ప్రభ గొంతు

జెలస్ ఇడియట్!

గ : డాక్టరుగారి అమ్మాయికి మంచి స్పిరిట్ ఉందిసార్!

కుడిపక్క గదిలోనుంచి డాక్టరు గొంతు

అయితే నీవుకూడా హాల్లో పోయి కూర్చో. అక్కడ గఫూర్ ఉన్నాడు. ఇప్పుడేవస్తాను——ఏం లాభంలేదు.

అతన్ని తీసుకు పోండి!

**కుడిపక్క వాకిట్లోనుంచి చింతయ్య ప్రవేశము**

చింతయ్య : శాస్త్రిగారూ దణ్ణము!

శా : మంచిది. ఓహో నీ పేరు—

చిం : [గఫూర్‌కు దూరంగా కూచుండి] చింతయ్య స్వామీ!

శా : ప్రభక్లాసేనా నీవు?

చిం : అవును. ప్రభగారు మంచి తెలివిగలవారండీ!

శా : అయితే నీవూ, గఫూరూ కొత్తవాళ్ళన్నే—?

చిం : మాకు సావాసమే కాని—

గ : వాడి మాటలకు ఏమి లెండీ.

చిం : శాస్త్రిగారూ, చూచారా వాడికెంత గర్వమో!

**కుడిపక్క గదిలోనుంచి డాక్టరు గొంతు**

కంపౌండర్, నేను లోపలికి వెళ్తున్నాను.

కంపౌండరు గొంతు

అవుసర ముంటే కబురు చేస్తాను సార్!

డాక్టరు ప్రవేశము. గఫూరూ, చింతయ్యా నిలబడతారు. గఫూర్ వంగి సలాము చేస్తాడు. చింతయ్య వంగి దణ్ణము పెడ్తాడు.

డాక్టరు : [అందుకుని] శాస్త్రిగారు చాలాసేపు కూచున్నట్లుగా ఉన్నారు.— ఇవ్వాళ అన్నీ పాడు కేసులండీ.

శా : ఫరవాలేదు. ఇక్కడ కులాసాగానే గడిచిపోయింది.

డా : గఫూర్, ఏదో మాట్లాడా లన్నావు?

గఫూర్ మిగిలినవారివేపు చూసి సందేహిస్తాడు.

డా : అంతా మనవాళ్ళే, ఫరవాలేదులే, అంత మరీ ప్రైవేటా?

గ : కాదులెండి కాని...[సందేహిస్తూ ఉంటాడు]

డా. : అయితే ఇంకా ఏం? శాస్త్రిగారికీ, నాకూ రహస్యాలు లేవు! చింతయ్య నీకు ముఖ్య స్నేహితుడాయెను. మళ్ళీ ఎవరయినా రోగులు వస్తే వెళ్ళవలసి

ఉంటుంది. తొందరగా కానీ!

శా : పోనీ నే నవతల పోయి కూర్చొనేదీ?

గ : ఎందుకులెండి సార్... మీఅమ్మాయి- [అను మానిస్తాడు]

డా. : నీతో ఏమైనా పోట్లాడిందా ఏమిటి?

గ : లేదు సార్ లేదు—చాలా మంచి అమ్మాయి అండీ!

డా. : అయితే?

గ : మీకు చాలా అడ్వాన్సుడు వ్యూస్ గనక—

డా : ఏమిటీ?

శా : కుర్రవాడు ఏ వివాహము సంగతో చెప్పబోతూ సిగ్గు పడుతుంటే, అట్లా తొందరపడతారేం డాక్టర్?

గ : శాస్త్రుల్లగారు సరిగ్గా చెప్పారు. నాకు ప్రభను ఇచ్చి పెళ్ళి చేయమని అడగడానికి వచ్చాను సార్!

డా : [ ఆలోచిస్తూ ] అట్లాగా — నా కభ్యంతరము లేదుకాని మా అమ్మాయి చేసుకుంటూ నన్నవాళ్ళకు

తప్ప దాన్ని పెళ్ళి చేయను. ఇంకా చదివేది ఇంటరు మీడియేటేగా! బి. ఏ. ప్యాసుకానిది బహుశహా చేసుకోదు.

గ : ప్రభ ఒప్పుకుంది సార్.

చిం : వీడు చెప్పేదంతా అబద్ధమండీ!

గ : [వచ్చే కోపము అణుచుకుంటూ] నీకు తెలియదు ప్యాసుకోవోయి!

చిం : నీకు మహా తెలుసు. పట్టి జూటాకోర్!

డా : చింతయ్యా, అతన్ని చెప్పనీ—

చిం : దణ్ణంపెట్టి మనవి చేస్తా. మీకు తెలియదు కాని వీడు పెద్ద హంబగండీ!

గఫూర్ పెదిమలు వణుకుతవి

డా : అంత తొందర పడతావేం చింతయ్యా?

చిం : ప్రభగారు నన్ను చేసుకుంటా నన్నారండీ. మీక్కూ మనవి చేసుకుందామనే వచ్చాను బాబూ!

గ : వీడు పట్టి స్కౌండ్రెల్ సార్.

చిం : నీవు రాస్కెల్!

గ : ప్రభ ఈ బేవఖూబ్ గాడిదను చేసుకుంటుందండీ!

చిం : వీడు బ్లాగ్గార్డు అండీ.

గ : వీడు ఫూల్ సార్! లయర్ సార్!

చిం : నిన్న సాయంత్రమండీ. ప్రభగారిని అడగండి!

గ : వీడిముఖమ్. నిన్న పొద్దునే నాకు చెప్పింది. ఈ బద్మాష్ మొఖం చూడనుకూడా చూడదుసార్ ప్రభ.

డాక్టరు నివ్వెరపోయి చూస్తూ ఉంటాడు.

శా : [నెమ్మదిగా] వీళ్ళిద్దరి మాటలూ నిజంగానే కనపడుతున్నాయి నాకు. — అయితే నీ వేమంటావు చింతయ్యా?

చిం : బాబూ, మీకు దణ్ణంపెట్టి చెప్తాతా వినండి. ప్రభ గారికి మంచి జాతీయభావము ఉంది స్వామీ. హరిజన సమస్య సాల్వ్ చెయ్యడానికి నన్ను పెళ్లిచేసుకుంటానని నిన్న సాయంత్రమే చెప్పింది. వీడు మహా పొగరు

బోతు అనికూడా అంది. లేకపోతే నేను ఇటువంటి పెద్దవారివద్ద అబద్ధము చెబుతానండీ?

శా : ఓహో! — అయితే, గఫూర్! నిన్న హిందూ ముస్లిముబందోబస్తుకోసం చేసుకుంటూ నన్నదా?

గ : [ఆశ్చర్యంతో] అవును సార్. సరిగ్గా నిన్న పొద్దునే- శాస్త్రిగారికి అంతా తెలుసు!

శా : డాక్టర్! మీరు మీఅమ్మాయికి చిన్నప్పుడే వివాహము చెయ్యమంటే స్వయంవరణము లేనిది చేయనని ఆపినారు కాదూ?

డా. : అవును, ఇప్పటికీ మా అమ్మాయి ఎవరిని చేసుకుంటా నంటే, వాళ్లకేతప్ప ఇంకొకరికి బలవంతాన ఇయ్యను.

శా : ఇప్పటికీ ఆపట్టుదల మానన ట్లేనా?

డా : మానడానికి ఇప్పు డేం జరిగింది?

గ : డాక్టరుగారు మాట తప్పరని అందరికీ తెలుసు!

శా : మాటమీద నిలబడతారుగా?

డా : ఆహా!

చిం : డాక్టరుబాబుగారు అబద్ధమాడడమే!

శా : మీకు బ్రాహ్మలంటే సరిపడదుగా. ఎవరయినా బ్రాహ్మణ్ణి చేసుకుంటానంటే ప్రభ నిచ్చి చేస్తారా?

డా : [నవ్వుతూ] అప్పుడు కాస్త ఆలోచించవలసిందే?

శా : ఇంకొకరిని చేసుకో నంటే?

డా : విధిలేక ఆ బ్రాహ్మణ్ణి తిట్టుకుంటూ ఇస్తాను. .

శా : ఇస్తారుగా!

డా : ఆ !

డా. భా : [వెనక వరండాలోనుంచి రివ్వున లోపలికి వచ్చి] బ్రాహ్మలు ఎంత స్నేహితు లయినా మోసము చేయక ఊరుకోరండీ!

డా : బ్రాహ్మలను తిట్టకూడదని నాకు చెప్పేదానివి నీవు ఇట్లా తిరిగిపోయినావేం!

శా : స్త్రీల మాటలకేం గాని — గఫూర్! నిన్ను ప్రభ చేసు కుంటా నని ఒప్పుకున్నట్లు సాక్ష్య మేమిటి?

గ : ప్రభనే అడగండి.

శా : అంతేనా? —పోనీ, ఈపెళ్ళి ఎట్లా చేసుకోవడమో ఆలోచించావా? ప్రభ మహమ్మదీయులలో కలుస్తుందా? నీవు హిందువులలో కలుస్తావా?

గ : ఆలోచించలేదు సార్. కోపం వద్దు. మాకు మీ హిందువులలో కలవడం తప్పు కాదు సార్! మానాన్న......

శా : పోనీ, చింతయ్యా, నీకన్నా వ్రాతపూర్వకమైన సాక్ష్యముందా?

చిం : ఇక్కడే ప్రభగారు ఉన్నారుగా, అడగండి బాబూ.

డా : శాస్త్రిగారు ఇక్కడకూడా ప్లీడరుగిరి మరిచిపోయినట్లు లేదే?

డా. భా : అసలే బ్రాహ్మలు! అందులో ప్లీడరు!

డా : [ఆశ్చర్యంతో] ఏమిటి?

శా : అయితే చల్లకు వచ్చి ముంత దాచడ మెందుకూ? మీ ప్రభను నా కీయమని అడగడానికే ఇంతసేపు

కూచున్నాను డాక్టర్!

డా : [ఫక్కున నవ్వి] మీకేం మతి పోలేదుకదా, శాస్త్రి గారూ! — కంపౌండర్!

కుడిపక్కనుంచి కంపౌండరు గొంతు

సార్!

డా : శాస్త్రిగారికి కాస్త స్లీపింగుడోజు తయారుచెయ్యి.

శా : మాట్లాడాలిసింది సవాలక్షగ్రంథ ముంటే, అప్పుడే నిద్దరపోతే ఎట్లా? పిల్లకు పేరే దాఖలా లేదుకదా! ఎక్కడన్నా పెళ్ళిచేసుకునే పిల్ల సిగ్గుపడకుండా ఇంత మందిలో వచ్చి తనకు ఎవరిష్టమో చెబుతుందా? ఇది చూడండి!

జేబులోనుంచి కాగితం తీసి డాక్టరుకిస్తాడు.

డా : [ బిగ్గరగా చదువుతాడు ] " శాస్త్రిగారికి ప్రభ వ్రాసి ఇచ్చిన అగ్రిమెంటు. నేను మిమ్ములను గాని, మీ ఇష్టము వచ్చినవారిని గాని తప్ప ఇంకొకరిని

వివాహమాడను. ఇది మంచి వ్యక్తితో మనస్ఫూ
ర్తిగా వ్రాసి యిచ్చిన అగ్రిమెంటు.

ప్రభ (దస్తూరీ స్వహస్తము)"

శా. భా : ఇందుకనే బ్రాహ్మలను నమ్మరాదు.

డా : [ఆలోచిస్తూ] అమ్మాయిదస్తూరే!

గ : నాకు ప్రభ వద్దులెండి సార్!

[నిష్క్రమిస్తాడు]

శా : పిల్లలు ఎదుగుతే వాళ్ల యిష్టము వచ్చిన వాళ్ళనే గాని చేసుకోరు. తల్లిదండ్రులు కూడా మంచీ చెడ్డా ఆలోచించుకునే వీలుండదు.

డా. భా : మీ మాటకు నే నెప్పుడూ అడ్డు చెప్పలేదు కాని, నా ప్రాణం పోయినా ప్రభను శాస్త్రిగారికి ఇవ్వనీయనండీ.

శా : మరి వాళ్లి కిద్దరికీ ఇస్తారా?

డా. భా : ఆ వె—వాళ్లకు మాత్రం?

డా : తారీకుకూడా ఈ రోజే. మరి అమ్మాయి శాస్త్రి గారిని తప్ప ఇంకొకర్ని చేసుకోనంటే ఏంచేస్తాము?

చిం. : నాకుమాత్రము ప్రభగారు ఎందుకు లెండి!

దణ్ణాలు పెడుతూ నెమ్మదిగా జారుతాడు

డా. : [కాగితము తిరగవేస్తూ] ఇది అమ్మాయిచేత నవ్వులకు వ్రాయించలేదుకదా!

శా : అందులో ఏమని ఉంది?

డా : అవును. "మనస్ఫూర్తిగా..."

డా. భా : వీరికి నలభైఏళ్ళు దాటినై? నాయీడు భార్య ఉన్నది మన అమ్మాయికంటె పెద్దపిల్ల లున్నారు. ఒకవేళ చిన్నతనంచేత అమ్మాయి చేసుకుంటా నంటే మాత్రము, మనకన్నా మతి ఉండవద్దా?

శా : అమ్మాయి మేజరు కాలేదా ఏమిటి?

డా : పంధొమ్మిదో ఏడు వచ్చి మూడురోజు లయింది.

డా. భా : ఏమిటండీ ఈ పిచ్చికాగితాలు ! చింపి

పారేస్తాను—ప్రభను ప్రకాశానికి ఇవ్వవలసిందే కాని ఇంకొకరికి ఇవ్వడానికి ఒప్పుకోను.

డా : నాకూ అందుకు ఇష్టమే కానీ, చూడూ! —

**ఎడమ గదిలోనుంచి ప్రభ, ప్రకాశం పోట్లాట చప్పుడు.**

డా : — చూడూ, వాళ్లెట్లా పోట్లాడుకుంటున్నారో! ఎప్పుడూ అంతే. దానికి ఇష్టము లేకపోతే ఏం జేస్తాము!

డా భా : ఇష్ట మేమిటండీ ! మీకు నన్ను ఇచ్చేటప్పుడు మా నాన్న నా ఇష్టము అడిగే ఇచ్చాడా? మన కాపరానికి ఏం లోటు! వాళ్లూ అట్లాగే చిలకా గోరంకుల లాగా ఉంటారు. ఈ గోల లేకుండా వాళ్ళిద్దరికీ త్వరగా ముడి పెట్టండీ.

శా : సత్య హరిశ్చంద్రుడని పేరుపడ్డ డాక్టరు స్త్రీల మాట విని అన్నమాట తప్పితే ఆయనమాట ఆయనకే ఉంటుంది. నా సొమ్మేంపోయె! [బిగ్గరగా] ప్రభా ! ఇట్లా రా !

ప్రభ సిగ్గుపడుతూ ఎడమ గదిలోనుంచి ప్రవేశిస్తుంది

శా : [ప్రభను దగ్గరకు తీసుకొని] తల్లీ, నాకు నీ వక్కర లేదులే! మీ అమ్మగారు నిన్ను వాళ్ల ప్రకాశరావుకు తప్ప మరెవరికీ ఇవ్వనంటున్నది కాని, పోనీ నువ్వూ అతన్నే తప్పక చేసుకో అమ్మా! [ప్రభ సిగ్గుతో తల వంచుకుంటుంది.] ప్రకాశరావ్! ఇట్లా రా!

ఎడమ గదివాకిటిదగ్గర ఉన్న ప్రకాశరావు ప్రవేశించి డాక్టరు భార్యదగ్గర నిలుచుంటాడు.

శా : నువ్వు ప్రభతో ఎప్పుడూ పోట్లాడుతుంటావెందుకూ?

ప్రకాశరావు: నేనుఎప్పుడూ పోట్లాడనండీ, అదే ఎప్పుడూ పోట్లాడుతుందికాని.

ప్రభ : అబద్ధము చెప్పవాక.—అది కాదండీ. ఎవరన్నా నాతో మాట్లాడడానికి స్నేహితులు వస్తే, నామీద ఇతను కొరకొరలాడుతూ ఉంటాడండీ!

ప్ర. రా : లేకపోతే, ప్రతి పనికిమాలినవాడితోటీ స్వతంత్రంగా ఉండడం ఎందుకండీ ఇది?

ప్రభ : ప్రకాశరావు ఎంత చదువుకున్నా పట్టి కన్వెన్షనల్ మనిషండీ!

డా. భా : సరేలేగాని, ప్రకాశరావ్! నీకు ప్రభను ఇచ్చి వివాహము చేస్తాము ఇష్టమేనా?

ప్ర. రా : నీమాటకు ఎప్పుడన్నా ఎదురు చెప్పినానా?

డా : ఇందులో మధ్య నాదేమీ లేదా ఏమిటి?

డా. భా : ఏమీ లేదు. అమ్మాయిని స్వయంవరానికి వదిలిన తర్వాత ఇంకా మీకేముంది?

డా : [నవ్వుతూ] ఓహో! మరి నీదో?

డా. భా : అంతా నాదే. శాస్త్రిగారూ, మీ రివ్వాళ ఈ నాటకమాడి చాలా శ్రమపడ్డారుకాని పనిలోపని త్వరలో లగ్నంకూడా మీరే పెట్టండి.

శా : శుభస్య శీఘ్రం! ఇప్పు డెంతయింది?

డా. ర : [చేతిగడియారం చూసి] తొమ్మిదీ నలభై ఆరు

నిమిషాలు!

శా : అయితే సరిగ్గా ఇప్పుడే మంచి లగ్నమున్నది. ప్రభా! నీవు మీ నాన్నగారు అమ్మగార్ల దగ్గరకు వెళ్లమ్మా! [వెళుతుంది] ప్రకాశరావుకు తల్లీ, తండ్రీ లేరు కాబట్టి నేను అతనితరఫున వ్యవహరిస్తాను, నాయనా, ఇట్లారా!

ప్రకాశరావు శాస్త్రి దగ్గర కొస్తాడు. డాక్టరూ, భార్యా, ప్రభ చెయ్యి ప్రకాశరావు చేతిలో పెడతారు. ఆకాశవాణి మంగళం పాడుతుంది.

ఆకాశవాణి

మంగళం మంగళం !
మనరాములకు
మంగళం మంగళం!

శా : తథాస్తు!

డా. భా : ఇద్దరూ పోయి శాస్త్రిగారికి నమస్కారం చేయండమ్మా!

డా. రు : నీ బ్రాహ్మణభక్తి—

ప్రభ : శాస్త్రిగారూ, చూడండీ ప్రకాశరావు నాచెయ్యి ఎట్లా నలిపి వేస్తున్నాడో!

ప్ర. రా : ప్రభ నా చెయ్యి ఎట్లా గిల్లిందో చూడండీ!

# వరాగమనము

అంకితము

లక్ష్మీ సుబ్రహ్మణ్యులకు

# వరాగమనము

## పాత్రలు

తల్లి — తండ్రి — వధువు — వరుడు

తల్లి : అప్పుడే అంత తొందర ఏమి వచ్చెనండీ!

తండ్రి : నా దేమున్నది? నీ ఇష్టము, నీ కూతురి ఇష్టము, నీ అల్లుడి ఇష్టము!

దూరాన మంగళతూర్యారవములు విన వస్తవి. అలంకరించుకుంటున్న వధువు ఉత్కంఠతో ఆగదిలోకి వచ్చి కిటికీలోనుంచి బయిటికి చూస్తుంది.

తల్లి : [కఠినంగా] అమ్మాయ్!

వధువు : [ఉలికిపడి[ ఏమమ్మా!

తల్లి : ఏంజేస్తున్నావే అక్కడ?

వధువు : కనపడడంలా జడ వేసుకుంటున్నది—

తల్లి : జడ లోపల వేసుకోరాదటే! ఈ ఇంట్లోకి ఎందుకే!

తండ్రి : చిన్నపిల్లమీద అంత అధికారమెందుకూ? [చిరునవ్వుతో] పెళ్ళికొడుకువారి మేళం విందామని వచ్చింది కాబోలు!

తల్లి : ఉండండి మీరు మరీని!

వధువు : [సిగ్గుతో] చూశారా, చూశారా మరి! — నేను అక్కడ చమటపోస్తుంటే చల్లగాలికి ఈ గది లోకి వస్తే, చూశారా మరి ఏమంటున్నారో!

తల్లి : ఇంట్లోకి వెళ్లవే అమ్మా!

వధువు : [తల విసురుకుంటూ ఇంట్లోకి వెళుతూ] వెళు తున్నారు లెద్దూ! మహా...

తల్లి : ఎందుకమ్మా తల విసురుడు! ఇంతకూ నిన్ను అని ఏమి లాభము? అంతా మీ నాన్నగారు చేస్తున్నారు!

తండ్రి : మధ్య నేనేం జేశాను?

తల్లి : పసిపిల్లకదా, అత్తవారింటికి వెళ్ళి ఎట్లా ఉండ గలదండీ!

తండ్రి : ఆడపిల్ల ఐనప్పుడు అత్తవారింటికి ఎప్పుడో పంపక తప్పుతుందా?

తల్లి : నేను మాత్రం అత్తవారింటికి పంప వద్దన్నానా? పోనీ శ్రావణమాసము వస్తున్నదికదా, నోములు ఇక్కడ నోయించి ఐనా పంపుదామని అండీ! మీకు ఆడపిల్లగదా అని ఒక ముచ్చటే లేకపోయె!

తండ్రి : నిజమే, లేకపోవడమేం? శ్రావణ మాసంలో ముఖ్యంగా ఆడపిల్లల నోములు. ఆ తర్వాత వినాయక చవితి. ఆ పిమ్మట నవరాత్రాలలో మన పూజలకు ఆడ పడుచు ఇంట్లో ఉండవలె. తర్వాత దీపావళి. దీపాలు వెలిగిస్తూ ఆ వెలుగులో అమ్మాయి ముఖం చూస్తే, ఎంతో ముచ్చటగా నక్షత్రాలలో చంద్ర బింబమల్లే ఉంటుంది. ఆ పైన సంక్రాంతి ఆయె, బొమ్మల పండగే ఆయెను! ఇంతలో శివరాత్రి. దేశ

దేశాల జనమూ కోటీశ్వరుడి తిరణాలకు ఇక్కడికి వస్తుంటే అమ్మాయిని ఎట్లా పంపుతాము? ఈ లోగా సంవత్సరాది వస్తుంది. ఆ రోజు ఇంట్లో పుట్టిన ఆడ పిల్ల ఇంట్లో లేకుండా అత్తవారింట్లో ఉంటే ఎట్లా!

తల్లి : అవునండీ మరి!

తండ్రి : అయితే మరి అమ్మాయిని అత్తవారింటికి పంపే దెప్పుడు?

తల్లి : అదుగో—నేను అత్తవారింటికి పంపవద్దన్నా నండీ, పండగదాకా ఉంచమన్నాను కాని.

**వధువు అలంకరించుకొనివచ్చి తండ్రివద్ద పరధ్యానంగా కూచుంటుంది.**

తల్లి : [కఠినంగా] అమ్మాయ్!

వధువు : [విసుగుకో] ఏమిటే అమ్మా, అట్లా ఉలిక్కి పడేట్లు కేకలు వేస్తావు!

తండ్రి : ఎందుకూ అట్లా కేకలు వేస్తావు? అత్తవారింటికి పంపే మాటలు మనం మాట్లాడు కుంటూంటే సర దాగా వింటామని వచ్చింది. దాన్ని కేకలు వేస్తావేం?

వధువు : చూశారమ్మా, ఏమి ఎక్కిరింపండీ మీ దగ్గర కాస్తసేపు కూచోవలె నని వస్తే!

తల్లి : తమ్ముడికి కాస్త తలదువ్వి బొట్టుపెట్టవే, లోపల పిలుస్తున్నాడు. చెల్లెలు లోపల ఆగం చేస్తున్నది. వాళ్ళసంగతి చూడవే. ఇట్లాంటి దానివి అత్తవారింట్లో కాపురం ఎట్లా చేస్తావే!

తండ్రి : ఇంతకూ పెద్దకూతురు నీ ఇంట్లో చాకిరికి లేకుండా వెళుతున్నదని నీ దిగులువలె ఉన్నదే.

తల్లి : నా రెక్కలు బాగా ఉండగా నా కెవరూ చాకిరి చేయక్కర లేదు. కూతురిని అత్తవారింటికి ఎప్పుడు పంపుదామా అని మీకే తొందరగా ఉన్నట్లున్నదే. —లోపలికి వెళ్ళవు టే?

వధువు : [పరధ్యానంగా] ఆ పంచమ స్వరంలో పాడే దేమిటి నాన్నగారూ?

తండ్రి : అవా? దూరాన కోయిల పెళ్ళికొడుకు 'రా, రా' అని పిలుస్తూఉంటే, మనదొడ్లో మామిడి చెట్టు

తండ్రి : అవునుతల్లీ! మా అల్లుడు మా తల్లిని తీసుకు వెళ్ళడానికి వస్తే, మేళం చేయడానికి వసంతుడు పంపినాడమ్మా వాటిని,

వధువు తలవంచుకుంటుంది.

తల్లి : మీ కవిత్వాలూ మీ అమ్మాయి కవిత్వాలూ అత్తవారింట్లో చాకిరి చేసేప్పుడు తెలుస్తాయిగాని... ఏమంటారు మరి!

తండ్రి : పిల్ల వెంట పంపవలసిన వస్తువులన్నీ సిద్ధంచేశావా?

తల్లి : అంతా సిద్ధము చేయకపోతే మీతో బతకవద్దూ! అయితే మీరు అమ్మాయిని ఉంచ మని అడగరా?

తండ్రి : ఆహాఁ!

తల్లి : పిల్లను ఎప్పుడెప్పుడు పంపుదామా అని మీకే తొందరగా ఉన్నదామె మరి అల్లుడికంటే!

తండ్రి : అవును!

తల్లి : మీ రడక్కపోతే, పోనీ నేనే అడుగుతాను. నన్నేం చంపుతాడా! నా కేం భయం లేదు. గౌరవం పోతుందట. నా కేం పోదు. నేనే అడుగుతాను.

తండ్రి : అది నీ ఇష్టము!

తూర్యారావములతో అల్లుడు ప్రవేశిస్తాడు. అల్లుడూ కూతురూ తల్లిదండ్రులకు పాదాభివందనము చేస్తారు.

తండ్రి : [అక్షతలు శిరస్సుల ఉంచుతూ] దీర్ఘాయుష్మాన్ భవ!—దీర్ఘ సుమంగళీ భవ!

తల్లి : [అక్షతలు వేస్తూ మూతి బిగించి] ఇప్పుడే అమ్మాయిని తీసుకు వెళ్ళవలసిందేనా?

వరుడు సందేహంతో మామగారి వంక చూస్తాడు. ఆయన తల వంచుకుంటాడు.

వరుడు : [వధువు ఎడమ చేయి పట్టుకొని] సెలవు తీసుకుంటాము.

తండ్రి : శుభం భూయాత్ !

తల్లి కూతురిని కౌగిలించుకొని కంటనీరు పెడుతుంది. వధూవరులు తూర్యారావ పురస్సరంగా నెమ్మదిగా నిష్క్రమిస్తారు. తల్లి వారితో గుమ్మందాకా వెళ్ళి వస్తుంది. తండ్రి వెక్కి వెక్కి ఏడుస్తూ ఉంటాడు.

తల్లి : ఏమిటండీ ఇది, శుభమా అని పిల్లను అత్తవారింటికి పంపుతూంటేను?

తండ్రి : నిన్ను పుట్టింటినుంచి తీసుకువచ్చిన రోజున, మీ అమ్మా మీ నాన్నా ఎంత ఇదైనారో జ్ఞాపకం ఉందా? వాళ్ళను ఏడిపించినందుకు మన కిది శిక్ష!

తల్లి : బాగానే ఉంది. అట్లా ఏడవ కూడదండీ!

తండ్రి : తపోధనుడైన ఆ కణ్వ మహర్షికే తప్పింది కాదీ దుఃఖము. అయినా ఇది ఏడుపు కాదు, ఆనంద బాష్పాల ధార!

"అర్థోహి కన్యా పరకీయ ఏవ
తా మధ్య సంప్రేష్య పరిగ్రహీతుః
జాతో మ మాయం విశదః ప్రకామం
ప్రత్యర్చిత న్యాస ఇ వాంతరాత్మా"